ఏప్రిల్ 1979

నవలానుబంధం

# నరుడి ఇరుకు ప్రపంచం

వంశీ

ముఖచిత్రం :

త్రిగుణ్

స్వాతి

సకుటుంబ మాసపత్రిక

పీతాంబరపురం

విజయవాడ-520 004

ఆడది రెచ్చగొడితే ఎంతటి మగాడైనా చెడిపోతాడు. ఈ ప్రపంచంలో ఏ మగాడు పాడయ్యాడన్నా ఏదోమూల ఆడదే కారణం అనిపిస్తుంది. వయసులో వున్న ప్రతి ఆడపిల్లా అందంగానే వుంటుంది–ఆ అందాన్ని అందుకోవాలనే మగవాడి తాపత్రయం దాన్ని అందీ అందిచకుండా ఊరించే ఆడదాని కవ్వింపు ఈ ప్రపంచంలో సహజం, ఆడది చిక్కుల్లోపడినా ? మగవాడు పిచ్చివాడైనా అందుకు కారణం ఆడదాని అందం. ఈ ఇరుకు ప్రపంచంలో మనిషి బ్రతకలేడు – ఆ బ్రతికే కొద్దిరోజులూ ఆనందంగా అందాన్ని అనుభవించలేడు – సుఖంలేని ఈ బ్రతుకులో ఎక్కడ చూసినా దగా..వంచనలు స్వార్థాలు.. మనిషికి సుఖంలేదు – అనుభవించడమే జీవిత పరమార్థమని మనిషికి తప్ప అన్ని జంతువులకు తెలుసు. ఈ ఇరుకు ప్రపంచంలో మనిషికన్న జంతువులేనయం అనిపిస్తున్నాయి– ఆడదాని అందం...మగవాడి కాళ్ళకు బంధం ఉన్నతుల స్వార్థం ..... లేనివాని మమగడ స్వహార్థం—, దీనికి అర్థం ఏమిటి ?—

# నరుడి ఇరుకు ప్రపంచం

వంశీ

3

గంటన్నర నుంచి వెన్నెల అతని దేహం నిండా చిమ్ముతోంది. ఆ ఏటి ఒడ్డున కూర్చున్న అతను వెన్నెల్నీ- ఏటిలో మెరిసిపోతూ పారుతూన్న నీటినీ మార్చి మార్చి చూస్తున్నాడు.

అతని మనసెప్పుడూ వికీర్ణంగా వుంటుంది. ఈరోజు అది మరీ అధ్వాన్నంగా తయారైంది.

ఏమిటి నేను తీసుకున్న నిర్ణయం మంచిదేనా? కాదేమో అన్పిస్తుంది. ఔనన్నా కాదన్నా చేసేదేం లేదు. సమయం మించి పోతోంది. మరి కొన్ని ఘడియలు కాలంమాత్రమే నన్నిలా బ్రతకమని నిర్ణయించింది. రాబోయే రేపులు మరో విధంగా వుంటాయి. అప్పుడు నిన్నటి నేనేనా ఇవాల్టి నేను? అని నామీద ఆశ్చర్యం వేసుకొస్తుంది. నవ్వుకుంటాను నిశ్శబ్దంగా, ఫిలాసఫిక్‌గా. ఊహించుకున్న భవిష్యత్తునీ, ఏరి కూడ గట్టుకున్న ఆశయాల్ని చెరిపేస్తూ పక పకా నవ్వుకుంటాను. దిక్కులు పిక్కటిల్లేలా వికటాట్టహాసాలు చేస్తాను?

ప్రకృతి నాలుగు దిక్కుల్నీ మార్చి మార్చి చూస్తున్నఅతని కళ్ళు బరువుగా మూతపడ్డాయి. విసుగొస్తూంది నిర్ణయం తీసుకోవడం చాతగాని, ఆలోచించడం చాతగాని తనకి జేబులోంచి నాసిరకం నలిగిన సిగరెట్ తీసి అంటించాడు. సిగరెట్ కాలిపోతూంది సిగరెట్ ఆయుష మూడుతూంది. తన సమయం తరిగిపోతూంది. ఆ వెన్నెల్లో కాలిపోతూన్న సిగరెట్ వంకచూస్తూ అది మరీ తొరగా కాలిపోవడానికి దోహదం చేస్తున్న తన పెదవుల్ని కసిగాకొరికి ఊపిరి వెవక్కి లాక్కున్నాడు.

"ఈ ప్రపంచం చాలా ఇరుకు. పుట్టిన ప్రతినరుడూ యీ ఇరుకులో కల్మష వాయువుల్ని పీల్చుకుంటూ, ఆయుష నిర్ణీతకాలం వరకూ బ్రతికి అనంతరం చావాలి. బ్రతకడం వోడ్కాట్యాటీగా ఇమేజినరీ చేసుకుని బ్రతికెయ్యాలి కదా......"

ఎర్ర కంకర రోడ్డు మీద బస్సు శబ్దానికి తల అటు తిప్పాడు. మదనపల్లి నుంచొచ్చే లాస్ట్ బస్ రాజన్న టీ పాక ముందుకు పాస్ఐంది. చూపు రోడ్డు మించి ఏటిమీదికి తిప్పాడు.

ప్రస్తుతం ఆ గ్రామంలో ఉంటున్న అతని వయసు పాతిక్కి ఆపైన తెల్లగా- పొడుగ్గా- పుష్టిగా ఉంటాడు. పెరిగిన అందమైన గెడ్డం- మానెరాయని అందమైన జుట్టూ, సందేహంలేదు అందంగానే ఉంటాడు. అతనికి వో నాలుగు రంగువేలిసిన జీన్ పాంట్లున్నాయ్. అలాగే వాటికి సరిపడే చొక్కాలు కూడా.

వర్తమానాన ఊషర క్షేత్రంలో మగ్గుతున్న అతను తన మనసువీన్ని యెక్కడికో నిర్జన తుషార శిఖరం అంటారే అక్కడికి లాక్కెళ్ళాలని విశ్వప్రయత్నాలు చేస్తున్నాడు.

కానీ. మార్గావరోధాలు- సంఖ్యాలేతమైనన్ని సమస్యలు - చుట్టుముట్టే విషాదం.

సగం యింకా కాలని సిగరెట్ ని యేటిలోకివిసిరాడు. చేపలు మేత పడిందనుకుని నీళ్ళలో అలజడి చేశాయ్.

కాస్సేపు గడిచింది. చెరుకుతోటలో నక్కల అరుపులు అధికం అయ్యాయ్. లేద్దామనుకుంటూండగా -

"హల్లో...గుడీవినింగ్."

"ఎవరు ?"

"నేను...ఫాతిమాని'"

"ఈ అర్ధరాత్రి ఎక్కడి నుంచొస్తున్నారు ?"

"మదనపల్లెలో మా ఆంటీ పని చేస్తోంది. ఈరోజు ఆదివారం కదా అని నిన్న సాయంత్రం బయలుదేరి వెళ్ళాను. లాస్ట్‌బస్ లేటయింది. ఈ ప్రవేటు బస్సులవాళ్ళ కసలు బుద్ధులుండవండీ-" చిన్న ప్రశ్నకి అవసరంలేని కథ చాలా చెప్పుకొచ్చింది. ఫాతిమా యీ వూరి ఎలిమెంటరీ స్కూల్లో టీచర్.

ఫాతిమా—

చాలా సెక్సీగా వుంటుంది. పాతికేళ్ళ తెల్లటి వంటి మీద షేపులు ఎగుడు దిగుడు మెట్లలా అందంగావుంటాయ్. ముందు ఎదురైతే వక్షద్వయం- వెనకనుంచి చూస్తే మడత లున్న నడుం మగాడి మస్తిష్కం చీల్చేస్తుంది. ఆ రోజు ఆమె లూజ్‌గా కట్టిన పల్చని తెల్లచీర మడతపెట్టి చిన్న అగ్గిపెట్టెలో దాచెయ్యవచ్చు.

"ఏమిటి నాకేసే చూస్తున్నారు ?" ఫాతిమా.

"అబ్బే...ఏంలేదు...ఉన్నట్టుండి చంద్రుడు కిందికి దిగాడేమిటా అని..." అతను.

"అంటే ?"

"మీరీరోజు చాలా అందంగా వున్నారు."

"చాలా సంతోషం, చాలా కాలానికి వచ్చింది మీ నోటమ్మట ఈ మాట."

"మనిద్దరికీ పరిచయంఅయ్యి వారం కాలేదు. అసలు నేను ఈ వూళ్ళోకి అడుగుపెట్టి పదిహేను దినాలు కాలేదు. చాలా కాలం యెలా అవుతుందీ ?"

"ఏమో...నాకలా అన్పిస్తుంది. అంతే."

"సరే...నడుద్దామా ?" అనేసి లేవబోయాడు.

"వెన్నెల మనకోసమే అన్నట్టుంది ... కాస్సేపు కూర్చుందాం" అని చేతిలో వున్న సూట్‌కేసు నేలమీద కుదేసి అతన్ని అంటీ అంటనట్టు పక్కగా కూర్చుని "వూ(...ఇప్పుడు చెప్పండి యింకా నేను యెంత అందంగా వున్నానూ ?" అంది అరచెయ్యి గడ్డానికాన్చి,

ఇంత చనువుగా మీది మీది కొస్తున్న ఆడదాన్ని ఏం చెయ్యాలో, ఏం చెప్పాలో అర్థం కాకుండా వుందతనికి. 'యేం చెప్పనూ ?' అన్నాడు పైకి.

"మూడేళ్ళు మద్రాసులో వుండొచ్చారు- యెందరో సిన్మాస్టార్లని జూసి వుంటారు ఆ మాత్రం చెప్పలేరా నా గురించి ?" అని కాస్త దగరకి జరిగింది.

ఈవిడ పద్ధతులు చూస్తుంటే గమ్మత్తుగా తోస్తుంది- ఏటి పక్కనే చింతలతోటవేపు చూపించి అటు పోదాం వస్తారా ? అంటే వచ్చేటట్టుంది తత్వం అన్పిస్తుంది.

"మాట్లాడ్రేం ?"

"చాలామంది సినిమా తారల్లా మీకూ్కడా ఇంటా బయటా వళ్ళు దాచుకోడం అంటే ఇష్టం లేదులావుంది." అన్నాడు.

ఆ మాటకి ఫాతిమా నవ్వేసింది గజ్జలమోతలా.

"మీ దేహానికి కొంచెం స్పర్శాజ్ఞానం తక్కువను కుంటాను ?"

ఈ మాటకి కూడా ఫాతిమా నవ్వింది సుడి గుండంలా.

మళ్ళీ సిగరెట్ అంటించి ఆమెనే చూస్తూండి పోయాడు. నిజానికి ఫాతిమా చాలా అందగత్తె. ఆమె అందం ఆనందం పొంగుల నురుగులా వుంది. ఆమె పల్చగా నవ్వితే చంద్రుడు ఉదయిస్తాడు – సన్నాలెగిరేలా నవ్వితే నక్షత్రాలు రాలతాయ్ – తుమ్మితే తుఫాను వస్తుంది – కోపిస్తే ఈశ్వరుడు మూడో కన్ను తెరుస్తాడు.

"అందాలగురించీ అల్లికలగురించీ తెలుసుకోవాలంటే ఆడాళ్ళ పత్రికలు చదూకుందాం గానీ, ఈ పూటకి మరి లేద్దాం" అని లేచాడు.

ఇష్టం లేనట్టు లేచి సూట్‌కేస్ అందుకుంది ఫాతిమా.

ఇద్దరూ ఆ యేరును ఆన్చివున్న చింతల తోటపక్కనుంచివేసిన మట్టిబాట మీదుగా వూళ్ళోకి నడిచారు.

ఆగ్రామం చిత్తూరు జిల్లాలో కురవల కోటకి ఐదు మైళ్ళ, దూరంలో వుంది. 'దుర్గం' అంటారా గ్రామాన్ని.

ఆ దుర్గం పేరు ఆ జిల్లాలో చాలా టౌన్ల పేర్లు తెలియని వాళ్ళకి కూడ తెల్సు. అందుకు కారణం ఆ జిల్లా అంతా బాగా ప్రసిద్ధికెక్కిన కేదారేశ్వరుడి ఆలయం ఆ వూళ్ళో వుండటమే.

నిజం, ఎక్కడెక్కడి నుంచో ఎందిరో భక్తులు ఆ గుడిలో దేవుణ్ణి దర్శించి విభూదితో అభిషేకాలూ, నేతితో అభిషేకాలూచేస్తూనే వుంటారు.

ధనవంతుడయిన ఆవూరి దేవుడికి వోపూజార్ల కుటుంబంవంశ పారంపర్యంగా అర్చన చేస్తుంది. ప్రస్తుతం ఆ గుడికి అర్చనచేస్తూ ఈ రోజుతో రిటైర్డ్ అయిన మాధవాచారి గారనే ముసలిపూజారి గారబ్బాయి ఇతను.

ఇతని పేరు చాలా చిన్నది—

శ్రీపతి.

• • •

ఫాతిమా పెద్ద వీధి మలుపులో విడిపోయి వెళ్ళి పోయాకా శ్రీపతి వొక్కడూ వెన్నెల పడుతున్న బాటను తొక్కుకుంటూ నడుస్తున్నాడు. తన నీడ పొడుగ్గా ఆంజ నేయుళ్ళా సాగుతోంది

వాకిట్లో మంచంవేసుకుని పడుకుని భార్యతో ఏదో చెప్తున్నాడు మాధవాచారిగారు. ఆమె వింటూ "వీడింకా రాలేదేమిటీ ?" అంటోంది మధ్య మధ్య. ఇంతలో వచ్చి యింట్లోకి వేగంగా వెళ్తున్న శ్రీపతిని—

"ఏమిట్రా ఇంతాలశ్యం...యెందాకా వెళ్ళావ్ ?" అనడిగింది తల్లి నాంచారమ్మ.

లోనికి వేళ్ళబోతున్న వాడల్లా గడపదగ్గర ఆగి తల వెనక్కి తిప్పి 'అలా ఏట్లోకి ?' అన్నాడు.

"ఏమిటీ ?"

"అదే ఏటి వేపెళ్ళాను షికారుకి" అని లోనికి వెళ్ళ బోతూంటే—

"ఆగాగు కాళ్ళు కడుక్కోకుండా ఏమిట్రాఅశుభ్రం" అని దాదాపు అరిచినంత పనిచేసింది.

"కాళ్ళెందుకమ్మా- జోళ్ళున్నాయిగా !"

"శివ శివా ముందు బావిదగ్గరకెళ్ళి కాళ్ళు కడుక్కురా" అంది కొంప కూలిపోతున్నంత హైరానా పడుతూ.

"ఛ ఛ వెధవ చాదస్తాలూ వీళ్ళూను" అని నసిగి బావి వేపెళ్ళాడు,

అన్నం తింటూనే గడపదగ్గర కూర్చున్న నాంచా రమ్మగారూ—

"ఔనూ......సిగరెట్టు కాలుస్తున్నావా ఇప్పుడు" అనుమాస్పదంగా.

ముద్ద నోట్లో పెట్టుకోబోతున్న వాడల్లా చూపు తల్లి వేపు తిప్పి సన్నగా నవ్వి 'చావుందమ్మా! అన్నం తింటు న్నావా అన్నట్టుంది నీ ప్రశ్న' అన్నాడు అన్నం కంటే సిగరెట్ ముఖ్యం గనుక.

"రామ రామ అన్నానికి సిగిరెట్టుకి పోలికేవిట్రా?"

"ఈ ప్రపంచంలో చాలామంది కొద్ది రోజులు అన్నం మానెయ్య గలరు గాని కొన్నిగంటలు సిగరెట్ మానలేరు. పోతే అన్నం అనేది పుట్టినప్పటినుంచీ మొదలైన అలవాటు సిగరెట్ మధ్యలో అంటుకున్న అలవాటు. అంతేభేదం"

అలా ఫోర్స్‌గా అన్న శ్రీపతి మాటలకి అవాక్కు యింది నాంచారమ్మగారు. అనంతరం 'శివా...రామా' అన్న మాటల ముక్కలు తప్ప వేరే కొడుకుతో ఏం చెప్పాలో ఆమెకి అర్థంకాలేదు ఆవకాశంకూడా రాలేదు.

తినడం అయ్యాక కంచం ముందునుంచి లేచి లోపలి గదిలోకెళ్ళి సిగరెట్ అంటించి మంచంమీద వాలాడు.

అలా అర్ధ రాత్రివరకూ గడిపి అనంతరం ఒక నిర్ణ యానికి వచ్చి 'సరే' అనుకున్నాడు.

ఆ "సరే" మీదే ఆధారపడివుంది రేపటి తన కార్య క్రమమంతా.

సరే అనుకున్న కొన్ని గంటలకి తొలికోడికూసింది.

## 2

గంధ సింధూరం రంగు పట్టుపంచ కట్టుకుని - అంగ వస్త్రంలాంటిది భుజంచుట్టూ కప్పుకుని - ఎడంచేత్తో దేవుడికి పెట్టే నైవేద్యం పట్టుకుని నడుస్తున్నాడు శ్రీపతి.

ఆ తెల్లవారుజాము ఆ వూళ్ళో కోళ్ళు కూస్తున్నాయ్.

లేగదూడలు అరుస్తున్నాయ్. ఆడాళ్ళు వాకిళ్ళలో పాచిలు చేసుకుంటూ కేదారేశ్వరుడి ఆలయానికి నైవేద్యం పట్టు కెళ్తున్న శ్రీపతికేసి వింతగా చూస్తూ-

"మాధవాచార్లుగారు ఇవాళ్టినుంచి గుడి కెళ్ళారా ?"

"పాపం ముసలి వయసొచ్చేసిందిగా ! ... ఆయనకి వారశికంగా అడుగో వెళ్తున్నాడు మనవూరి పాతరౌడీ"

"గట్టిగా అరవకే వినిపిస్తుంది"

"వినిపిస్తే భయమేంటే తప్పన్నానా ?"

"ష్...వింటున్నాడే పోతూ"

"వినసీ వాడేకెవరు భయపడ్తారు?

"నెమ్మది...ఔనూ...మరి మద్రాసంటూ పరుగెత్తాడు గందా యేదో ఉద్యోగం...ఏవయింది?"

"ఉద్యోగవా! వాహ!! యేదో చేస్తున్నానని ఉత్తరాలు రాసేవాడు అంతేనట"

"అదా సంగతి...చూశావా పుట్టిన ఊర్ని అసహించుకున్న వీడికి తిరిగి అదే గతయ్యింది"

"ఔను...కులవృత్తినీ పుట్టిన ఊర్నీ ఎప్పుడూ అవమానించకూడదట."

వెళుతున్న శ్రీపతికి ఆ మాటలన్నీ వినిపిస్తున్నాయ్.

జనం చాలా చిత్రమైనవాళ్ళు. ఒకప్పుడు శ్రీపతినీ, ఈ రోజు శ్రీపతినీ ఊహించుకొని ఒకటిగా కలుపుతున్నారు. కలిపి అసహించుకుంటున్నారు.

తన నడవడికలో ఆనాటికీ ఈనాటికీ రవంత మార్పు లేదు. తనలో మొరటుతనం-పౌరుషం - వుద్వేగం-చికాకూ ఎక్స్ట్రా ఎమీ తగ్గలేదు. ఏదీ మారలేదు. మారదు. పెరిగాయి, ఇంకా పెరుగుతాయి.

జనం అజ్ఞానులు. వాళ్ళ అజ్ఞానానికి, తనని అపార్థం చేసుకొనడానికి కారణం వుంది. అది తర్వాత,

శ్రీపతి అసలుపేరు స్వేశ్వ. తనెలాంటి కుటుం బంలో పుట్టనీ తనకక్కర్లేదు. తన వంశంతో ఆచారాలకీ, వ్యవహారాలకీ, విష్టలే తను అవంచితుడు. అందుకేనేమో తను సిగరెట్లు కాలుస్తున్నాడు. మద్రాసులో వున్నప్పుడు తాగాడు. స్త్రీలని అనుభవించాడు. ఇంకా ఎన్నో చేశాడు. అది ఈ జనానికి తెల్సు. ఎందుకంటే ఈ పల్లెటూళ్ళో వున్నప్పుడుకూడా తను అన్నీ చేసేవాడు. టీచరు రాజేశ్వ్రరావుగారమ్మాయి రామేశ్వరి తన కారణంగా గర్భిణీ అయింది. కల్లుకొట్టు దావీదు తనకు స్నేహితుడయ్యాడు. ఈ పాపాలకి తను ఈ ఊరికి రౌడీ అయ్యాడు. గుడిగంటలు మాయంకావడానికి తనే కారకుడయ్యాడు.

ఇన్ని చేసినా విచిత్రం! తన తండ్రికి తన గురించి ఏమాత్రం తెలీదు. అందుకు కారణం తనని కన్న నాంచారమ్మగారు. ప్రతీ విషయాన్నీ సర్దుకుంటూ వస్తూంది. తనని పోరుతుంది నసపెడుతుంది.

ఇవన్నీ తల్చుకోలేదు. స్మరించుకోలేదు. తీరా గుర్తొస్తే తన వాళ్ళు మార్తాండబింబం అవుతుంది. తన హృదయంలో బడబాశిఖ బ్రద్దలవుతుంది. అందుకే ఏదీ తల్చుకోకుండా ముందుకి పోతున్నాడు... పోతున్నాడు.

# 3

దుర్గంలో పల్లెటూరికి అవసరం అయిన హంగామా సరంజామా అంతావుంది. కానీ ఒక రావిచెట్టూ, రచ్చబండ మాత్రమే లేవు. అవి లేని కారణంగా వాటిమీద కూర్చొని తీర్చుకోవాల్సిన అవసరాలు ప్రెసిడెంటు బుచ్చిరెడ్డిగారి ఇంటి అరుగుమీద కూర్చుని తీసుకుంటారు. దుర్గం గ్రామ ప్రముఖులు.

"ఎలా వుంది కొత్త పూజారి జోరు?" ప్రెసిడెంటు బుచ్చిరెడ్డి, కరణం రామ్మూర్తిని అడిగాడు.

"ప్రస్తుతానికి ఎలాంటి కంప్లయింట్సు లేవండి" కరణం రామ్మూర్తి జవాబు.

"ఐనా వాణ్ని పవిత్రమైన ఆలయానికి పూజారిగా నియమించడం మన ధార్మికనికల్‌కి విరుద్ధం" శ్రీపతి కారణంగా తన కూతురు చెడిందన్న అక్కసుతో అన్నాడు అక్కడే వున్న రాజేశ్వర్రావు మాస్టారు.

"వీళ్ళ వంశంవాడే గుడికి అర్చన చేయాలన్నది అనాదిగా వస్తున్న రూలు. సరే రూలు పాటించక పోవడం నేరం అని, మాధవాచార్లుగారు ముసలాయన అయ్యాడట యీ పుత్ర రత్నాన్ని నియమించాం. నాలుగు రోజులు చూస్తాం. పూర్వంనుంచీ పొగరు బోతైన యీ కుఱ్ఱపూజారి ప్రవర్తన ఏమీ బాగోటంలేదని బహిరంగంగా వెల్లడిచేసి తీసేస్తాం." అని పథకాన్ని వెల్లడి చేశాడు మున్సబు నరశింహంగారు.

పై నలుగురూ ఆవూరికి ప్రముఖులు. గుడి మంచీ చెడ్డలూ-వూరి చెడ్డా, మంచిలూ వాళ్ళు నలుగురూ స్నేహితులు చాలా సమస్యల్లో భాగస్తులు. (అన్ని విషయాల్లోనూ భాగస్తులైన వీళ్ళు ఆ వూరికి ప్రెసిడెంటూ ఆ గుడికి ట్రస్టీ ఐన ప్రెసిడెంటు బుచ్చిరెడ్డికున్న కొన్ని స్వకీయమైన విషయాల్లోనూ సమస్యల్లోనూ కాస్త విడిపోతుంటారు.)

బుచ్చిరెడ్డి బాధల్లా యీ కొత్తపూజారి రాకవల్ల గుడి ఆదాయం దెబ్బతింటుందని స్వేఛ్ఛకి వీడు పేతువు ఔతాడనీ

# 4

మిట్టమధ్యాహ్నం అవడంవల్ల కేదారేశ్వరుడి గుళ్ళోకి భక్తులెవరూ రాలేదు. వూళ్ళోకి భిక్షాటనకొచ్చిన యిద్దరు

ముగ్గురు సాధువులు మాత్రం గుడి మంటపంలో చల్లగా వుందని నిద్రపోతున్నారు.

ఖాళీగా కూర్చున్న గుడి పూజారి శ్రీపతికి సిగరెట్ కాల్చాలనిపించింది. తను చెయిన్ స్మోకర్, సిగరెట్ లేకుండా క్షణం వుండలేడు. అలాంటి తను యీ పట్టు బట్టల్లో వుండగా సిగరెట్ కాల్చకూడదు, కాల్చడు.

ఆ దినం ఆదివారం. మద్రాసులో వున్నప్పుడు ఆది వారాలు ఎలా గడిచేవో స్మరిస్తుండగా తన ముందు ఒక తరళకాంతి ప్రసారంఅయింది,

ఆ కాంతి పేరు ఫాతిమా. తురకాడి మిట్టమధ్యాహ్నపు ప్రార్థనలా ఏమిటీ సమయంలో? అరిటిపళ్ళు కొబ్బరికాయతో గుడిలోకి వచ్చి తనముందుకొచ్చింది ఫాతిమ? గతంలో ఆమె ఈ గుడికి ఎప్పుడూ ం లేదు. ఈ మధ్య తరచు వస్తుంది, ఎందుకో తనకి చర్వితచరణమే. అలవికాని పనులుచేయడం ఆడాళ్ళకి చాలా ఇష్టమనుకుంటాను. పాపం ఫాతిమా మిట్టమధ్యాహ్నపు అవస్తకి జాలేసింది ఆమెపైన.

ఆమె తెచ్చిన పళ్ళూ కాయా దేవుడికి నైవేద్యంపెట్టి ప్రసాదం తిరిగి ఇస్తూ "ఏమిటీ సమయంకాని సమయంలో?" అనడిగాడు.

"ప్రత్యేకత చూపిద్దామని" అని నవ్వింది.

"దేవుడికా?"

"దేవుడ్ని ఎప్పుడూ నమ్మను,"

"మరెందుకా శ్రమ?"

"సాయంత్రం మా ఇంటికి వస్తానంటే అప్పుడు చెప్తాను" అంది ఫాతిమ.

"మీ ఇంటికా? కష్టం...రాను" అన్నాడు కఠినంగా.

"ఏం భయమా?"

"అదేంకాదు. మీ కిష్టమైతే మీరేరండి యేటిఒడ్డుకి."

"సరే." అని వెళ్ళిపోయింది ఫాతిమ.

యీ ఫాతిమా పద్ధతులు ఛాలా గమ్మత్తుగా వున్నాయ్. యెందుకో తనకోసం తెగ ప్రాకులాడుతోంది. తనంటే పడి చస్తుంది [స్త్రీ మనస్తత్వం పిచ్చిదాని తిరుగడులాంటిది.] యీ స్కూల్ టీచర్ ఫాతిమా కోసం యీ వూరంతా పడిచస్తుంటే తనకోసం యీ ఫాతిమాపడి చస్తుంది. అందర్ని తన సిన్సియారిటీతో తోపేసి తన మీద చాలా దిగజారి పోయి పడుతుంది. యీమెనుంచి విర్ముక్తం కావడం కష్టం అన్పించేట్టు ప్రవర్తిస్తుంది. తనని కష్టడీలో వుంచేపేట్టుంది.

రాత్రి పదకొండయింది. వూరంతా నిద్రపోతుంది. ఎప్పుడు వుండే వెన్నెల ఆరోజు లేదు.

ఏటివొడ్డున మామూలుగా సిగరెట్ కాలుస్తూ కూర్చున్నాడు.

యింతలో తెల్ల చీరలో వెన్నెల్లా వొచ్చిపడింది ఫాతిమా, యీసమయంలో వస్తానన్న ప్రకారం వచ్చిన ఆమె ధైర్యానికి చాలా బెదిరాడు శ్రీపతి.... వూరివాళ్ళు పొద్దుపోతే యీప్రాంతానికి చచ్చినారారు. యేటికి కుడి ప్రక్కన చింత తోటలో దెయ్యాలుంటాయని జనవాక్యం. యిలాంటి భయంకరమైన విశ్శబ్ద వాతావరణంలో విర్భయంగా వొచ్చి తెల్లపావురంలా తన పక్కన వాలిన యీ స్త్రీధైర్యానికి యే మగాడు బెదిరిపోడూ? మగాడైన శ్రీపతి మరీ బెదిరిపోయాడు. పారే యేరు చప్పుడూ— ఫాతిమా వూపిరి చప్పుడూ అతని రెండు చెవులకు స్పష్టంగా వినిపిస్తున్నాయ్.

ఫాతిమా ముఖం తన చేతులకు చాలా చేరువవుతుంది శ్రీపతి నవ్వుకున్నాడు.

"ఏమిటా నవ్వు?" వాయుస్వరంతో అంది ఫాతిమా.

"ఏమీలేదు నీ ప్రవర్తనకి"

"నా అందాన్ని అంతగా మెచ్చుకునే నువ్వు నా ప్రవర్తనని మెచ్చుకోవా?

"మెచ్చుకోవడం అటుంచు. ఏదో పిచ్చిపిచ్చిగా అని పిస్తుంటేనూ"

"ఔను కోరిన ప్రతిమగాణ్ణి తిరస్కరిస్తూ పాతి కేళ్ళు గడిపేసిన నేను యీనాడు నీకోసం పిచ్చి దాన్నయి పోతున్నాను " అని ఆమె చెయ్యి శ్రీపతి నడుం చుట్టూ అల్లింది. అలా అల్లి అదిమింది.

"యీ ప్రపంచంలో రెండురకాల పిచ్చివాళ్ళున్నారు ఫాతిమా! పిచ్చెక్కి పిచ్చాళ్ళయిన వాళ్ళు కొందరూ యెప్ప టికీ అందని దానికోసం కళ్ళముందు వూహించుకునే వాళ్ళు కొందరు. నిజానికి యిద్దరూ పిచ్చివాళ్ళు కాదు ఫాతిమా!"

"మీమాటలు స్టేట్‌మెంట్లలా వుంటాయ్" అని ఆమె తన సున్నితమైన దేహాన్ని అతని వొంటిమీద కప్పబోతే అతను దూరంగా వొత్తిగిల్లాడు.

"నలుగురూ అసహించుకునే నన్ను నువ్వుయింత దగ్గరకి తీసుకుంటున్నావంటే నాతో నీకేదో పెద్ద అవసరమే వుండి వుంటుంది, లేదా వెట్టి అభిమానం పుట్టి వుంటుంది."

"నీతో నాకెలాంటి అవసరం లేదు. నువ్వన్న రెండో మాటే నిజం."

"నిన్ను నేను ప్రేమిస్తున్నాను."

"ప్రేమలూ— కాకరగాయలూ నాకిష్టం వుండవ్. యెందుకంటే యీ రెండింటి రుచీ నాకు సరిపడదుగనుక.''

"అబ్బా! అంత ఘోర్సుగా మాట్లాడితే నాగుండె చూడు యెలా కొట్టుకుంటోందో!"

అమె మాటకి పకపకా నవ్వేసిన శ్రీపతి "నీ ఆశల అద్దకం గుడ్డని రేపే ఉతికి ఆరెయ్యి. యిక నీగుండెకి గుబులూ- అదురూ వుండవు" అని లేచి వెళ్ళిపోయాడు.

అతని ప్రవర్తనకి ఫాతిమా మనస్సు చివుక్కుమని వుంటుందా? అనే వుంటుంది. కానీ ఫాతిమా ఏమి మాట్లాడ లేదు. నిశ్శబ్దంగా అతను వెళ్ళిపోతుంటే చూస్తూ నిలబడింది ఆ చింతల తోట చీకట్లో.

# 5

శ్రీపతి గుడికి పూజారి ఐనప్పటినుంచీ వూళ్ళో వాళ్ళెవరూ దైవదర్శనానికి రావడంలేదు. యిక రేపటినుంచి పొరుగూరివాళ్ళుకూడా రారేమోనని భయం పుడుతోంది ప్రెసిడెంటు బుచ్చిరెడ్డికి అతని మిత్రులికీ

ఆ విషయంమీదే అరుగుమీద చర్చజరుగుతుంది.

వీణ్ని తప్పించేద్దాం అంటే వీడెలాంటి పాపం చెయ్యడంలేదు. పూర్వం వూరిరాజకీయాల్లోనూ, మాలపల్లికీ వూరికీ మధ్య వర్గభేదాల్లోనూ తలదూర్చే యీ శ్రీపతి యిప్పుడు యెలాంటి విషయాల్లోనూ కలగజేసుకుని చెడు అనిపించుకోనందుకు ప్రెసిడెంటుకి బాధగా - ఇబ్బందిగా వుంది.

అప్పుడైతే యీ శ్రీపతిగాడు పానకంలో పుడకలా అడ్డొచ్చేవాడు. బుచ్చిరెడ్డి మెదడుకి సమస్యలు తెచ్చిపెట్టి చంపేసేవాడు. అలాంటివాడు యిప్పుడు తనదారినే పోవడం చాలా అశాంతి రేకెత్తిస్తుంది.

వాడు చేసే తప్పుకోసం ఎదురు చూస్తున్నారు. యిక వాడి తప్పుకోసమే ఎదురు చూడ్డం శరణ్యంగా నిర్ణయించు కుని పొద్దుపోయిందని విడిపోయి యెవరి యిళ్ళకి వాళ్ళెళ్ళి పోయారు.

* * *

లోపలిగదిలో పడుకుని సిగరెట్ మీద సిగరెట్ కాల్చే

స్తున్నాడు శ్రీపతి. కిటికీలోంచి ప్రసారం ఔతున్న పొగ ఆ గదంతా విండిపోయింది.

"ఏవిఁటోయ్ లోపల్నుంచి యేదో వాసనొస్తోంది? వాకిట్లో మంచంవేసుకు పడుకున్న మాధవాచారిగారు భార్యని అడిగారు.

"సాంబ్రాణి పొగయ్యి వుంటుంది" అని సరిపెట్టిం దామె.

"సాంబ్రాణి పొగా?......యిన్నేళ్ళుగా దేవుడికి అర్చన చేస్తూ బ్రతికేను సాంబ్రాణి పొగవాసన తెలియదా?"

"మరేం వాసనంటారు?"

"అదే తెలీక నిన్నడుగుతున్నాను"

"లోపల అబ్బాయి యేదో పూజ చేస్తున్నట్టున్నాడు చూసి వస్తానుండండి" అనేసి లోనికెళ్ళింది.

కొడుకు చాలా వున్నతుడని ప్రగాఢంగా నమ్మతారు మాధవచారిగారు. యీ వూరి జనం మాధవాచారిగార్ని చాలా గౌరవిస్తారు. కొందరు పూజిస్తారు. ఆయన సున్నితమైన మనసు తెల్సిన వూరి జనానికి నీ కొడుకు యింత సన్యాసి-లయ్యాడు అని చెప్పలేరు.

కానీ, శ్రీపతిదో బాధ. తన గురించి తన తండ్రికి తెలిస్తేనే మంచిది. లేకుంటే అంతా వొకేసారి విన్న తండ్రి గ్యారంటీగా గుండాగి చనిపోగల్డు. శపిస్తూ మరీ చనిపోగలు.

# 6

ఆ చీకటి చింతల తోటలో తనని కౌగలించుకుంది పాతిమా.

ఆ వూళ్ళో యెందరి కళ్ళల్లోనో వడ్డ పాతిమా చాలా

మందికి కలలరాణి ఐన ఫాతిమా తన కోసం యెందుకిలా ప్రాకులాడుతోందో ఆరోజే అర్థమైంది శ్రీపతికి. యెందుకు?

"నాకూడా వొచ్చేస్తావా పతీ?"

"యెక్కడికి?"

"యెక్కడికో సుదూర తీరాలకి. నిర్జన తుషారా కేంద్రానికి"

"హుఁ...యీ ప్రపంచం వో అరణ్యం ఫాతిమా శాంతి అనేది యెక్కడాలేదు. యెప్పుడూ రాదు. మనం యెక్కడికన్నా బయల్దేరావాఁ! వెళ్ళే కొద్దీ యిరుకూ చీకటీ పెరిగిపోతుంది తప్ప మరేంకాదు"

"నాదగ్గర వో ఐదువేల రూపాయిలున్నాయ్. మనిద్దరం మద్రాసు పోదాం. శాంతిగా బ్రతుకుదాం సరే!"

"మద్రాసు...నీకు తెలిసిన స్వర్గం - నాకు తెలిసిన నరకం" స్వగతం పలికాడు శ్రీపతి.

ఆరోజుకి వాళ్ళిద్దరూ విడిపోయారు.

శ్రీపతి యింటికొచ్చాడు. తను పడుకునే గదిలో గాలి రావడంలేదు. మళ్ళీ యేటివొడ్డుకేవొచ్చాడు.

యీ ఫాతిమా మళ్ళీ తన గతాన్ని రేపింది. అలలు అలల్లా గతం తన ముందు కదలాడింది. ఆమెకి మద్రాసు కావాలి. ఫాతిమాని కబళించడానికి మద్రాసెప్పుడూ సిద్ధంగా వుంది. మళ్ళా ఏటినుంచి ఇంటికి నడుస్తున్నాడు పిచ్చివాళ్ళా

# 7

యిదంతా శ్రీపతి ఫ్లాష్ బాక్ గొడవ - రొద - గోల - ఆర్తి.

స్థలం : మద్రాసు.

ఆడది రెచ్చగొడితే యెంతటి మగాడైనా చెడిపోయి తీరతాడు అనే వివాదం అసలు లోకంలో వుందోలేదో,వుంటే లోకవ్యాప్తంఐందో కాలేదో తెలీదు.

యీ ప్రపంచంలో యే మగాడు పాడయ్యాడన్నా యెక్కడో యేదోమూల ఆడదే కారణం అని పెద్దగా సక్సెస్ కావి వెనకటి ఓ తెలుగుమూవీలో డైలాగు.

సరె, సరే—

అనగా అనగా మద్రాస్ ఆళ్వార్ పేటలో 'సఖీ' అనే ఓ ఆడదుండేది. యీపాటికి పెళ్ళయ్యే వుంటుంది. లేదూ బాగా పాడైపొయ్యన్నా వుంటుంది. రెండూ నాకపోతే బ్రతుకుమీద విరక్తిపుట్టి ఏ కాశీకో పరారై వుండాలి. లేదూ అసలే చనిపోయన్నా వుండాలి. ఇవి సఖీమీద సామాన్యుల కుండే అంచనాలు. కానీ సఖీ అసామాన్యమైన ఓ అమృత కలశం. యింతకీ 'సఖీ' తెలుగుదేశపు అరిటాకూ - తెల్ల దేశపు పండుటాకూ అనే సందేహాలు అక్కర్లేదు. సఖీ సరాసరి కేరళా దేశంనుంచి రైల్లోంచి మద్రాసులో జారిపడ్డ ఓ వెలుగు వెన్నెలముద్ద.

తెలుగు, తమిళ రాష్ట్రాల్లో. నూటికి తొంభై మంది అందగత్తెలైన ఆడవాళ్ళు వున్నట్టు ధృవపరుస్తాయ్ రెండు రాష్ట్రాలవాళ్ళ సిన్మాలూ, నవలలూను. కానీ కేరళాలో నిజంగానే ఎనభై శాతం అందగత్తెలున్నారు. ఆ యెనభై మందిలో యీ సఖీ వొకర్తె—

సఖీ శరీరం తెల్లటిది. చెంపలు పల్చటివి. చేతి వేళ్ళు పొడుగ్గా సన్నటివి. కడుపులో శన పెరిగిన చేపకి చిన్న పొట్ట వున్నట్టు సఖీకి చిన్న పొత్తికడుపుంది. చీర బొడ్డుకిందికి కట్టినప్పుడు అది మరీ స్పష్టం ఔతుంది. నిత్యం కాటుకతో అలుక్కుపోయే కళ్ళుంటాయ్. వాటి రెప్పలు టపా టపా కొట్టుకున్నప్పుడే స్పష్టమౌతాయ్ అవి చాలా

విశాలమైనవని. జుట్టుకి జడవేయకుండా స్వేచ్ఛగా వొదిలేసి నప్పుడే తెలుస్తుంది అది జుట్టుకాదు పట్టు అని. అన్నన్ని లాలిత్యపు గుంపుల్ని సంతరించుకున్న సఖికి యేం పేరు పెట్టొచ్చు? భువనమోహిని అనొచ్చా? రసస్యందిని? సుప్తరాగిని? ఆ పేర్లు పెట్టొచ్చా??? సందేహం అక్కర్లేదు.

త్యాగరాయనగర్ ఆనందా స్ట్రీట్‌లో వున్నప్పుడు ఆ నెలాఖరు రోజున యింటి వోనర్‌తో పెద్దగొడవై వెంటనే కాస్త దూరంగా ఆళ్వార్‌పేట, సి. వి. రామన్ రోడ్డుకి కాస్త సందులోకి షిఫ్ట్ అయ్యాడు శ్రీపతి.

కొత్తగా దిగిన ఆ బిల్డింగ్‌లో కింద పన్నెండూ - పైన పన్నెండూ పోర్షన్లున్నాయ్- మొత్తం యిరవైనాలుగు కుటుంబాల్ని మింగిందా భవనం. తను అప్‌స్టెయిర్స్‌లో ఇరవైనాలుగో నెంబరు గదిలో దిగాడు.

ఆ దిగిన రోజు రాత్రి సరిగా నిద్రపట్టలేదు. అప్పటికి అర్ధరాత్రి పన్నెండు. క్రింది పోర్షన్లోంచి అస్పష్టంగా ఏవో పదమంజీర ధ్వన్లు సోకుతున్నాయ్. లేచి సిగరెట్ వెలిగించి మెట్లు దిగి కిందికెళ్ళాడు. కింద యెనిమిదో నెంబరు పోర్షనో ట్యూబులైటు వెలుగుతోంది. కిటికీ రెక్కలు తీసి వున్నాయ్. అదుగో అందులోంచే ప్రసారం ఔతున్నాయ్ గజ్జెల చప్పుళ్ళు.

శ్రీపతి కిటికీ వేపుకి బాగా దగ్గరగా వెళ్ళి కిటికీ లోంచి లోనికి చూశాడు అదృశ్యం—

లోపల డాన్స్ రిహార్సల్స్ చేస్తున్న ఆమె దేహమంతా తడిసివుంది. డాన్స్ చేసి చేసి అలసటగా కింద కూర్చుని వుందామె. ఆమె డ్రస్సు చెమట చిత్తడిలో తడుస్తోంది.

అలసటగా అలా కూర్చున్న ఆమె కిటికీ వేపు

చూసింది. ఆమెలో భయం - కాస్త కంగారూ వున్నాయ్. తటాల్నలేచి కంగారుగా అరిచింది. అరవడంలో "యార్‌వీ!" అవి. (అర్థం 'హర్ని!' అని కాదు. ఎవరునువ్వు? అని) చెప్పాడు శ్రీపతి.

అంతా విని కాస్త స్థిమిత పడిందామె.

"డాన్స్ అంటే నాకు చాలా క్రేజ్" అన్నాడు శ్రీపతి.

"రండి చూస్తారా?" అని ఆహ్వానించింది.

లోనికొచ్చి చాపమీద కూర్చున్నాడు. "యీరూమ్‌లో మీ రొక్కరే వుంటున్నారా?" అడిగాడు.

"ఔను."

"వంటరి తనం విసుగేయదూ?"

"విసుగే మరి...రేపు ఉదయం చేసే రిహార్సల్సు యిప్పుడు చేస్తున్నాను." అంది.

"మీరేం చేస్తారు?"

"పేతు మాధవన్ అనే డాన్స్ మాస్టర్ దగ్గర అసిస్టెంట్‌ని...నా పేరు సఢీ" అంది సఢీ.

కాస్సేపు కూర్చుని "రేపొస్తాను" అని లేచాడు.

"రేపు రిహార్సల్సు చెయ్యనుగా!" అంది సఢీ.

"మళ్ళీ చేసినప్పుడొస్తాను." అన్నాడు.

"యెప్పుడైనా రండి...ఔనూ మీరేం చేస్తారు?" అడిగింది సఢీ.

"నిరుద్యోగం వొకటుంది. దాన్ని పట్టుకుని వేళ్ళాడు తున్నాను." సంగ్రహంగా చెప్పి మరి కదిలాడు.

• • •

అలా పరిచయం ఐన సఢీ చాలా తక్కువ కాలంలో చాలా యెక్కువగా సన్నిహితం ఐంది. అలా ఐన చనువు యెంతవరకూ బిగిసిందంటే, శ్రీపతి భుజంమీద చెయ్యేసి

చరిచి "యేవోఁయ్!"అనేంతవరకూ. శ్రీపతి సఖీ నైలన్ స్కర్ట్ వీపుభాగం జిప్ పెట్టేంతవరకూ.

కాంటాక్ట్ అంతవరకూ బిగిసిందంటే అందునా వో వయసులో వున్న ఆడదానికి- మగాడికీ మధ్య బిగిసిందంటే వాళ్ళిద్దరి మధ్యా చాలా వుదంతాలు జరగాలి. కానీ శ్రీపతీ సఖీ మధ్య అలాంటివేం జరగలేదు.

"మరేం జరిగిందంట ???

ఆ సింగిల్ కాట్ మీద ఫోమ్ బెడ్డుంది. దానిమీద వల్చగా, నలిగిన లేతరంగు టాంబేడైయింగ్ దుప్పటుంది. ఆ దుప్పటి మీద యిద్దరు నరజాతి వాళ్ళు.

"జరిగిపోయిన దాని గురించి తల్చుకోడం అంటే నాకు చాలా బాధోయ్" మంచంమీద నిర్లక్ష్యంగా పడుకున్న సఖీ అలా అంది బాధగా.

"ఔను...... మనందేన్నయితే మర్చిపోదాం అని ప్రయత్నిస్తామో అదే గుర్తొచ్చి చంపేస్తుంది" మంచంమీద కూర్చున్న శ్రీపతి అన్నాడు.

"సర్లే దాన్ని మళ్ళీ రిఫర్‌చేసి నన్ను బాధించకు" అని శ్రీపతివేపు తిరిగి "ఔనూ... నేన్నీకు అర్థం అయ్యానా?" అనడిగింది.

సఖీ ప్రశ్నకి నుదురు చిట్లించి, కళ్ళు మూసుకుని నవ్వాడు శ్రీపతి.

"మాయ ఎవరికైనా అర్థం ఔతుందా? మాయకి అంతు వుంటుందా అన్నాడు శ్రీపతి.

"నన్నర్థం చేసుకోవాలంటే నిర్భయంగా నాలోనికి ప్రవేశించు."

"ఔను... అదే చెయ్యాలను కుంటున్నాను సఖీ. నిన్ను పెళ్ళి చేసుకుంటాను."

శ్రీపతి మాటలకి ఫక ఫకా నవ్వేసింది సధీ.

"నన్ను భరించలేవని నాసందేహం శ్రీపతీ!"

"ఎలా?"

"నీ పల్స్ చూశాను."

"మరేం చెయ్యను?"

"రేపోసారి నాతోరా...నా మాయ ప్రపంచాన్ని,నా వ్యావృత్తుల్ని ప్రత్యక్షంగా చూడు...అప్పుడు నీ అవగాహ ననిబట్టి నిర్ణయించుకో" అంది సధీ.

"సరే" అని వెళ్ళిపోయాడు శ్రీపతి.

• • •

వో స్టూడియోలో పెద్ద మేకప్ రూమ్; సమయం మిట్ట మధ్యాహ్నం. మరైనా ఆ గదిలో చాలా చల్లగావుంది సమశీతోష్ణం గనుక.

ఆ దినం ఫ్లోర్‌లో ఇంద్రభవనం సెట్‌లో వో గ్రూపు సాంగ్‌ని పిక్చరైజ్ చేస్తున్నారు. గ్రూప్ డాన్సర్స్ పది మందిలో సధీ వొకర్తి. ఆ పదిమంది ఆడాళ్ళకి పది మంది మగ వాళ్ళ.

మిట్ట మధ్యాహ్నపు బ్రేక్ టైమ్‌లో ఆ యిరవై మందీ ఆ పెద్ద మేకప్ గదిలో యీ నాగరిక ప్రపంచానికి ప్రాతికుల్యంగా వ్యవహరిస్తుంటే వాళ్ళ మధ్య క్షణం వుండ లేక పోతున్నాడు శ్రీపతి. విలవిలా కొట్టుకుంటున్నాడు.

పేరుకది వెడల్పాటి మేకప్ గదయినా అదేదో వింత ప్రపంచంలా వుంది. బహుశా అది 'చెలం' కోరిన ప్రపంచం గాబోలు.

ఆ దినం పల్చటి నైలన్ డ్రస్‌లో చాలా అద్భుతంగా వుంది సధీ. ప్రపంచంలో లాలిత్య శేషంలో పరిప్లావితం ఐనట్టుంది సధీ. వెన్నెల బొమ్మలావుంది సధీ. నిర్ఝరిణిలా వుంది సధీ. నిజంగా రసస్పందినిలా వుంది సధీ.

అందంగా చెక్కిన వజ్రంలా హృద్యమైన అవయవ సౌష్టవంతో సౌందర్య లహరిలా లేదూ సధీ? ఔను.అలాగే వుంది యీ పరిసరమంతా తమిస్రం ఐతే ఆమె జోత్స్న వెలుగులా లేదూ? నిజమే వుంది.

అప్పుడే భోంచేసి, ఆ గదిలో సోఫామీద అలసటగా కూర్చునే నిద్రపోతున్న సధీ పక్కకి సంగమేష్ అనే డాన్సర్ వొచ్చి, ఆమెని జేర్చి కూర్చుని ఆమెతో కబుర్లాడు తున్నాడు. సధీ అతని సంభాషణతో నిద్రని మరిచి వుత్సాహంతో ప్రవర్తిస్తుంది. అతని మీద చేతులేస్తుంది.

ఆ దృశ్యం చూస్తున్న శ్రీపతికి వొళ్ళు మండిపోయింది. అతని అంతర్యపు పొరలవెనక సధీ మీద చెప్పలేనంత ఉద్విగ్నం- ఏవేవో చెడు వూహల సంశ్లేషం- ఆ ఇరవై మందినీ పడి చంపెయ్యాలన్నంత ఆవేశం. కానీ ఏమీచెయ్య లేని స్థితి. నిస్త్రాణగావుండి పోయాడు.

రాత్రిలోపు అలాంటి వుదంతాలు చాలా, చాలా జరిగాయ్.

ఆ స్టూడియోలో వున్నంతసేపూ చాలాసార్లు చనిపోయాడు శ్రీపతి.

• • •

రాత్రి మళ్ళా సుధీ రూమ్‌లో———

"చూశావుగా నా ప్రపంచం యేమన్పించింది?" అని అడిగింది సుధీ జవాబు చెప్పలేదు శ్రీపతి.

"గంటనుంచి చూస్తున్నాను. ముఖం అదోలా పెట్టి సిగరెట్టు కాల్చడం ఏవిటీ?"

మాట్లాడలేదు శ్రీపతి.

"అదే శ్రీపతీ! అదే నా నిజమైన ప్రపంచం. ఆ ప్రపంచంలో మనిషి చాలా హాయిగా బ్రతకచ్చు. మనసులో అసలు కల్మషం అనేది ప్రవేశించదు. ఒకవేళ యేదన్నా

చేరినా ఆక్షణాన కాక్షణం శాశ్వతం అయిపోతుంది. నిజంగా మనసుకి మనుగడకి యెంతహాయి!" అంది సధీ.

శ్రీపతి ఆలోచిస్తున్నాడు. నిజంగా సధీ బిహేవియర్ చాలా గొప్పది. కానీ తను భరించలేడు. మరింత ఇరుకులో ఇరుక్కుపోతాడు. మరి తన వాతావరణం విశాలం కావాలంటే యెక్కడుందది? తను నిర్మించుకోవాలా సధీలా? ఏమో! ఏమైనా తను సధీతో బ్రతకలేడు. భరించలేడు. పారిపోవాలి సధీ దగ్గరనుంచి వెంటనే

నిశ్శబ్దంగా లేచాడు శ్రీపతి.

"ఏమిటి మాట్లాడవా శ్రీపతీ!... నా ప్రవర్తన నీకు నచ్చలేదా? అసహ్యంగా వుందా? నేను ఈదేశంలో పుట్టడానికి తగనా? పుడితే మరో వందేళ్ళ తర్వాత పుట్టాలా? ఏమిటి పతి మాట్లాడూ !!!"

సధీ ప్రశ్నకి జవాబు చెప్పలేదు. అసలు మాట్లాడనే లేదు. నిశ్శబ్దంగా నిష్క్రమించాడు. మళ్ళీ సధీకి ఎన్నడూ కన్పించకూడదు. అని నిశ్చయించుకుని వెంటనే రూమ్ ఖాళీ చేశాడు.

• • •

మద్రాసులో కొడంబాకం ఏరియాలో ఒల్డ్‌వాడై స్ట్రీట్‌లో 7/8 నెంబరు గల ఇంట్లోకి దిగాడు.

కొడంబాకం ప్రాంతంలో అద్దెకి యిళ్ళు చాలా చవగ్గా దొరుకుతాయ్. రామ్ థియేటర్ ప్రాంతంలో మరీని. ఈ ఒల్డ్‌వాడై స్ట్రీట్ రామ్‌థియేటర్ ఏరియాలోనే వుంది.

తను దిగిన డాబా మరీ పాతది. నెలకి నలభై రూపాయలు. పైన డాబామీద తాటాకు పందిరిలాంటిది వేసి యింకా చవగ్గా అద్దెకిస్తుంటారు. వాటిని కొట్టాయిలు అంటారు. తనుండే డాబామీద కొట్టాయిలో ట్రిప్లికేన్ ప్రాంతాల్లో వో నాన్ వెజిటేరియన్ హోటల్లో పనిచేసే

వో సప్లయర్ కుటుంబం వుంటుంది. ఆ సప్లయర్ కులానికి హయ్యరు. పెద్ద కుటుంబంతో మద్రాసులో బ్రతకలేక సప్లయర్‌గా పని చేస్తున్నాడు.

తమిళుల్లో హయ్యర్ల వంశం చాలా గొప్పదట. ఆచారపరంగా వాళ్ళు మన ఆంధ్రా బ్రాహ్మలకంటే గొప్ప వాళ్ళట. పేరుకి మాంసం అమ్మే హోటల్లో సప్లయర్‌గా పనిజేసినా సుచీ - శుభ్రతల్లో చాలా నిష్ఠాతుడుగా వుంటాడు ఆ హయ్యరుగారు.

హయ్యరుగారి సంతానంలో వయసులో వున్న వొక మ్మాయి వుంది. పేరు శెల్వి.

వయసులో వున్న ప్రతీ ఆడపిల్లా అందంగానే వుంటుంది. అలాగే వయసులోవున్న శెల్వికూడా అందగత్తే.

నల్లటి జుట్టుకి బాగా మూనె రాసి బిగిగా జడల్లుతుంది. ఆ జడ జాకెట్టు వీపుమీద అటూ ఇటూ వూగినప్పుడు జాకెట్టు ఆ వెనకభాగం కాస్త నల్లగా మాస్తుంది. శెల్వి దేహం రంగు మీడియం బ్లాక్ కేశాలు తిమిరంలాగా - కళ్ళు విల్లు ఆకారం లాగా - చెంపలు నీలి కలువరేకుల్లాగా నడుం గాలికి కదలాడే లతికలాగా...పాత రిఫరెన్సే.

యింతకీ నిజంగా శెల్వి అందగత్తా? కాదు. కానీ ఆరాధించొచ్చు. వద్దన్నా ప్రతిమాలి ప్రాతిమాలి మరీ ప్రేమించొచ్చు. శెల్వి వాళ్ళుండే డాబామీద ఆ కొట్టాయి పైన నీళ్ళు కుళాయి లేదు. ప్రతీ రోజూ వుదయంపూట నీళ్ళ బిందితో కింది బావిలో నీళ్ళ కొస్తుంది. ప్రతిరోజూ దాదాపు వో పదిబిందెల నీళ్ళయినా పైకి మోసుకు వెళ్తుంది. అలా మోసుకెళుతున్నప్పుడు నీళ్ళ చిలకరింపుకి ఆమె దేహం తడిసినప్పుడు ఆమె అవయవాలు ఆ తడిసిన గుడ్డలోంచి అస్పష్టంగా అందంగా కన్పిస్తుంటాయి.

బావి దగ్గర శ్రీపతి తువ్వాలు చుట్టుకుని స్నానం

చేస్తుంటే శెల్వి వచ్చేది. చేదబావిలోకేసి తాడుని ఆమె లాగు తున్నప్పుడు ఆమె ముఖంలో అందమైన అలసట- చెంపల మీంచి జారాడే శ్వేదబిందువుల్ని అలా చూస్తూవుండి పోయే వాడు. మెత్తటి తన చూపుల బాణాలు ఆమె చెంపలకి తగుల్తున్నప్పుడు ముఖం చిత్రంగా విరిచేది. గమ్మత్తు, అప్పుడే చూడాలి ఆమె అందాల్ని.

• • •

రోజులు గడుస్తున్న కొద్దీ శ్రీపతి గుండెల్లో శెల్వి మీద యేవో ఆలోచనలు పుట్టుకొస్తున్నాయ్. యీ శెల్వి ఆ సధీకి పూర్తిగా వ్యతిరేకం. మగాడు ఆమె దేహాన్ని ముట్టుకుంటే వెంటనే ఆభాగాన్ని నిప్పుతోకాల్చుకునే తత్వం శెల్విది. సధీ వందసంవత్సరాల తర్వాత పుట్టాల్సిందయితే శెల్వి వంద సంవత్సరాల వెనక పుట్టాల్సిన పిల్ల.

చూపుల్తో పరిచయం ఐన శెల్వి యిప్పుడు తనతో మాట్లాడుతుంది. వచ్చీరాని తెలుగులో చిలకపలుకులు పలుకు తుంది. చాలా మాట్లాడదావనే వుత్సాహం శెల్విముఖంలో కన్పిస్తుంది. కానీ వాళ్ళమ్మ కొట్టాయిమీంచి చూసి కొడు తుందని భయం శీలం యెక్కడ చెడిపోతుందో నన్నభయం. కళంకితం ఐపోతానన్న భయం.

నిజానికి యీ భయాలూ— చింతన— చింతాధార- యీర్ష్య యివే మనిషి ఇరుకు జీవితానికి కారణభూతాలు ఇవే స్వేచ్ఛకి పేతువులు.

పోను పోను సిగ్గును కొంతవరకూ మరిచి, శ్రీపతి మంచితనాన్నీ- వున్న తత్వాన్ని బాగానమ్మి బాగానే మాట్లా డుతుంది. వాళ్ళమ్మ యే గుడికన్నా వెళ్ళినప్పుడూ-వాళ్ళయ్య హోటల్‌లో డ్యూటీకి వెళ్ళినప్పుడు, కిందే తచ్చాడేది. కళ్ళతో కబుర్లాడేది.

శెల్వి సంప్రదాయాలూ - ఆచారాలూ - శ్రీపతికి పూర్తిగా నచ్చకున్నా కొంతవరకూ ఆమోదించాడు.

యీకాలపు స్త్రీ అటు సఖీలాగా యిటు శెల్వి లాగా లౌక్యంగా మధ్యస్తంగా వుండాలనేది శ్రీపతి వాదం.

ప్రస్తుతం తను శెల్విని మార్చాలనుకుంటున్నాడు.

• • •

రాత్రి యెనిమిది గంటలు యింకా కాలేదు.

శెల్వి వాళ్ళనాన్న హోటల్లో నైట్‌డ్యూటీకి వెళ్ళాడు వాళ్ళమ్మ చెల్లెళ్ళు పడపళని కుమరన్ కోవెలకు వెళ్ళారు. శెల్వి వొక్కర్తే వంటరిగా వంట ముగించి సావకాశంగా కిందికి దిగింది.

గడప దగ్గర ఆమె వస్తుందని కాచుకు కూర్చున్న శ్రీపతి యీ మంచి అవకాశం వినియోగించుకోవాలని చూస్తున్నాడు.

మెట్లు దిగి వీధివేపెళ్తున్న శెల్విని—

"శెల్వీ!" అని పిల్చాడు.

చివ్వున వెనక్కి తిరిగి చూసింది. ఆ చీకట్లో ఆమె నేత్రకాల్యం మణిలా మెరిసింది.

"యిలారా?"

వొచ్చింది

"లోనికిరా!"

రాలేదు. శ్రీపతి రూమ్‌లోకి ఆమె యెప్పుడూరాలేదు. మాటలూ చూపులూ, అన్నీ బావి దగ్గరే.

"రా లోనికి నిన్నేం చెయ్యను"

బెదురుతూ వొస్తుంటే "రా" అని చెయ్యిపట్టుకు లాగాడు.

జెర్రి దేహంమీద పడితే యెలా దులుపుకుంటుందో అలా శ్రీపతి చెయ్యిపడ్డ దేహ భాగాన్ని వోణీ అంచుతో

దులుపుతుంది.

శ్రీపతి వింతగా చూశాడు ఆమెకేసి. ఆమెని టచ్ చెయ్యడం యిదే మొదటిసారి.

ఆమెలోని కౌచ్చాక తలుపు వేస్తుంటే భయపడే జింకలా చూపింది.

"నిన్నేం చెయ్యనులే" అని ఆమె మొహం దగ్గరగా తన మొహాన్నుంచాడు, ఆమె నేత్ర కాల్వంలో స్పష్టంగా తన ప్రతిబింబం కన్పిస్తుందిప్పుడు. అతని వూపిరి పీల్చలేక ముక్కులు మూసుకుంది శెల్వీ.

ఆమె ప్రవర్తనకి నవ్వాడు.

"నవ్వుతావేం ?" అంది.

"నవ్వొచ్చి" అన్నాడు.

శెల్వీకూడా నవ్వింది.

"శెల్వీ ? నీకు పెళ్ళయిందా !"

తలూపింది కాలేదన్నట్లు.

"నువ్వు బాల వితంతువ్వా !"

కాదన్నట్లు తల తిప్పింది.

"మాంసం తింటావా నువ్వు."

"ఛీ ఛీ, తినను అన్నట్టుముఖం పెట్టింది నా ఎంగిలి తింటావా ?"

వుహూఁ తిన్నట.

"యెంత కాలంగానో నీతో యెన్నో మాట్లాడాలని యెంతో మేటర్ ప్రిపేర్ చేసి పెట్టుకున్నాను, ఇవ్వాళ ముందు కొచ్చేసరికి అంతా గాలికెగిరి పోయింది శెల్వీ!... రా యిలా కూర్చో." అన్నాడు.

మంచం అంచుమీద కూర్చుంది.

ఆమె ప్రక్కగా తను కూర్చుంటే అసహ్యించుకున్నట్టు దూరంగా జరిగింది.

"నేనంటే నీకు ఇష్టమేనా?"

"వూఁ"

మరెతే యెందుకలా ప్రవర్తిస్తావ్ ?"

"మేం హయ్యర్లం"

"ఐతే...మరైతే" అని యేదో చెప్పబోయి ఆమె భుజం మీద చెయ్యి వేశాడు.

అంతే పడగలెత్తిన కాల సర్పంలా లేచింది.

ఆమె ముఖం చూసి కంగారు పడిపోయాడు.

"నేనంటే ఇష్టమన్నాక... మరి నన్ను పెళ్ళి చేసుకుంటావా?"

"చేసుకోను"

"మరెందుకు యిష్టపడ్తున్నావ్ ?"

"ఏమో !"

"చాలా చిత్రమైన దానివి శెల్వీ, చాలా గమ్మత్తుగా వుంది నీ సాత్వికాభినయం... చాలామంది కన్నెలు పెళ్ళి కాకముందు భర్తల్ని కోరుకుంటారు. ఆడదానికి మగవాడు మగవాడికి ఆడదాని - అవసరం - సృష్టి ప్రేరణ శెల్వీ నన్ను పెళ్ళి చేసుకోరాదూ !... జీవితం హాయిగా గడుపుదువుగాని...ఏం ??

"వుహూ...నిన్ను పెళ్ళాడను...మేం అరవబ్రాహ్మలం, మా అప్పచేసిన పెళ్ళి చేసుకుంటాను. మా అప్పా అమ్మా చెప్పిందే చేస్తాను" అంది శెల్వీ.

"మరి నా దగ్గరకి వెళ్ళమని మీ అప్పా అమ్మా చెప్పారా?" అడిగాడు.

"లేదు. నా యిష్టంతో వొచ్చాను"

"మరి నీ యిష్టంతోనే నన్ను పెళ్ళాడు"

"నా వల్లకాదు... నాకు ధైర్యంలేదు"

"రోజూ నా గదికి రా నేను నేర్పుతాను"

"అలాచేస్తే మా అప్పా అమ్మా చచ్చిపోతారు. వాళ్ళు పోతే నేను ఏడుస్తాను"

"హూ... పిచ్చి శెల్వీ! యీ మహానగంలో బ్రతుకు తున్న నువ్వు యీ పాత యింటిలో యింత పాత బ్రతుకు బ్రతుకుతున్నావంటే నాకు నవ్వొచ్చేస్తుంది చూడు శెల్వీ మన పెద్ద వాళ్ళు మనల్ని వాళ్ళలాగే తయారు చేస్తారు. కానీ మనం వాళ్ళలా బ్రతకడం సాధ్యంకాదు. మారే కాలంతో పాటు మనమూ మారాలి. మార్పు అనేది మన లోనేవుంది. మార్పు అనేది మననుంచే వస్తుంది. శ్రీపతి అలా మాట్లాడుతుంటే విసుగొచ్చింది శెల్వికి. లేచినుంచుంది "మేం అరవ బ్రాహ్మలం... మేం అరవ బ్రాహ్మలం" అని వెళ్ళిపోతున్న శెల్విని బలవంతంగా రెక్కపట్టుకుని నిలిపి ఆమె నున్నటి బుగ్గమీద కర్కశంగా కొరికి తియ్యగా ముద్దుపెట్టాడు.

అతని ప్రవర్తనకి సదీలాంటి అడదైతే "సై" అను నేమో గానీ శెల్వి మాత్రం "ఛీ" అని అసహించుకుని వాయువేగంతో అక్కడ నుంచి పారిపోయింది.

ఆమె పైకెళ్ళాక పైనుంచి విన్పిస్తున్న బిందీ చెంబు చప్పుళ్ళని బట్టి శ్రీపతి యిలా వూహించుకున్నాడు.

శెల్వి స్నానం చేస్తుంది. సాయంత్రమే తలారా స్నానం చేసిన శెల్వి మళ్ళీ ఇప్పుడు తన గదిలోకి వొచ్చి నప్పుడు పట్టిన మైలనీ-కల్మషాన్ని క్షాళనం చేసుకోవడానికి శెల్వి మళ్ళీ తలారా స్నానం చేస్తుంది.

చాలాసేపు పకపకా నవ్వుకుని. రిలీఫ్‌కోసం సిగరెట్ వెలిగించాడు శ్రీపతి.

• • •

కాలం అనే వాయు సర్పం పది నెలల కాలాన్ని మింగేసింది మరి!!!

ఆ డాబా మీద కొట్టాయిలో వుండే శెల్వీ వాళ్ళ నాన్నకి మూడు నెలలుగా పని లేదు. ఆ నాన్‌వెజిరేరియన్ హోటల్లో సర్వర్ వుద్యోగం పోయింది. వేరే యెక్కడా దొరకలేదు. ప్రపంచంలో యెవరికీ తిండీ-పడకా లేకున్నా హోటలు సర్వరుకి మాత్రం వుంటుందన్న గ్యారంటీ వుంది. అలాంటిది శెల్వీ వాళ్ళ 'అప్ప'కి పనెందుకు దొరక లేదు? అతని ప్రవర్తనా సాంప్రదాయాలూ అలాంటి హోటళ్ళల్లో పనికిరావు. పూర్వం పని చేసిన హోటలు వాళ్ళు గాబట్టి ఆమాత్రమైనా సమ్మతించి - భరించారు. ఇక వాళ్ళు సహించలేక పో పొమ్మన్నారు. పోనీ యే ఉడిపీ హోమ్ లోనూ పని చేద్దామంటే అక్కడ ఆదాయం బహు తక్కువ. టిప్పులు అవీ రావు. ...ఆ కారణాల ప్రభావ ఫలితం ఆయనకి పని లేదు. ఇక దొరకదు.

ఆ దినం సాయంత్రం శెల్వీ వాళ్ళ అప్ప వూరంతా తిరిగి నీరసంగా డాబా మెట్లెక్కుతుంటే శ్రీపతి చూశాడు. అతని - వడిన ముసలి దేహం కాలం విడిచిన కుబుసంలా వుంది. ఎండిన పెదాలు బల్లి చర్మాల్లా వున్నాయ్. కళ్ళు ఆరిన అగ్ని శిఖల్లా వున్నాయ్. మూడుపై పల్చని తెల్ల వెంట్రుకలు గత జీవిత సంఘటనల మొక్కల్లా వున్నాయ్. వెళ్తున్న అతన్నే అలా చూస్తూ వుండిపోయాడు శ్రీపతి.

వొక రోజు వుదయం తనింకా నిద్ర లేవలేదు. ఆదివారం జనాన్ని బద్దకస్తులుగా తయారు చెయ్యడానికి వస్తుంది. శ్రీపతి ఆ ఆదివారం బద్దకంగా నిద్రోతున్నాడు.

తలుపు టక్ టక్ మంది.

"యెవరూ?" బద్దకంగా అన్నాడు.

మళ్ళా టక్ క్‌క్‌లు.

యెవరబ్బా! అనుకుని తలుపు తెరిచాడు.

ఆశ్చర్యం; వూహించని దృశ్యం శెల్వి ముఖంలో ఏమాత్రం నవ్వు - కాంతీ లేకుండా మౌనంగా తన గుమ్మం అవతల తన విగ్రహం ముందు నిలబడ్డ శెల్వి.

"యేం శెల్వీ! యేం కావాలి!"

"మా అమ్మ ఈ రోజునుంచి ఇడ్లీలు వేస్తుంది. మీకు కావాలేమో అడుగమంది" అంది దృష్టి పాదాలమీదుంచుతూ.

"సరే పట్రా" అన్నాడు.

వెంటనే డాబా మీది కెళ్ళి వో సిల్వర్ పళ్ళెంలో పది ఇడ్లీలు తెచ్చి "యెన్ని కావాలి?"

"అన్నీ" అని పదీ తీసుకుని రెండు రూపాయిల నోటు యిచ్చాడు.

అది పట్టుకుని వెళ్ళిన శెల్వి ఐదు నిమిషాల్లో వో రూపాయి నోటు తెచ్చి తన కిచ్చింది.

"పర్లేదు వుంచు శెల్వీ!"

"పది యిడ్లీలూ రూపాయే" అని రూపాయి నోటిచ్చి వెళ్ళిపోతుంటే "రేపట్నుంచి పట్రా తీసుకుంటాను" అన్నాడు.

సరే అని తలూపి నిష్క్రమించింది.

మరుసటి రోజు నుంచీ రోజూ తనకి ఇడ్లీలు తెచ్చి యిచ్చే శెల్వి, వో బేసిన్‌లో ఇడ్లీ పట్టుకుని వీధిలో కెళ్ళింది.

తను శెల్వి నీడని చూస్తూ - శల్యంలా ఐపోతున్న శెల్విని చూస్తూ ఆలోచిస్తూ వుండేవాడు.

అలా పదిహేను రోజుల పాటు శెల్వి ఇడ్లీలు తెచ్చి వున్నట్టుండి తేవడం మానేసింది. అందుక్కారణం ఇడ్లీల మీద వొచ్చే ఆదాయం చాలక అసలు కూడా యింట్లో ఖర్చయిపోయేది. ఎందుకా ఇడ్లీల వ్యాపారం??

వాళ్ళు అంతా పస్తులు పడుకుంటున్నట్టు శ్రీపతికి స్పష్టంగా తెలుస్తుంది. యెంత తిండి లేకపోయినా వాళ్ళ స్నానాలూ - జపాలూ పొద్దుపోతే వడపళని కుమరన్ కోయిల్‌లో ప్రార్ధనలూ మానేవారు కాదు.

''చిత్రమైన జనం – చిత్రమైన జీవితాలు'' అని స్వగతం పలికేవాడు శ్రీపతి.

రెండు నెలల తర్వాత—

పది గంటలు దాటిన ఆ రాత్రి—

శెల్వి వాళ్ళింట్లో యెవరూలేరు, వాళ్ళ అప్ప వూరిమీదకి వెళ్తే వాళ్ళమ్మ పూజకెళ్ళింది.

గదిలో నిద్రరాక కొట్టాడుతున్న శ్రీపతికి తలుపు చప్పుడైంది. యెవరూ అని అడక్కుండా యెవరొచ్చారా అని వూహించకుండా వెళ్ళి తలుపుతీశాడు.

శెల్వి.

మొన్నటిదాకా చిక్కని వజ్రంలాంటి అవయవాల సొంపులతో లేత మామిడి పండులాంటి మెత్తటి దేహంతో వుండే శెల్వి యీరోజు చాలా చిక్కిపోయి చాలా బలహీనంగా కన్పించింది. యెలాంటి వూహకి పోనియ్యకుండా చేస్తుందామె రూపం. యెలాంటి ఎక్స్‌పోజింగ్‌కీ పనికి రాకుండా వున్నటుందా రూపూ-చూపూ.

"యేంకావాలి శెల్వీ?" అమెను తలుపుబయట్నుంచే అడిగేడు.

"లోనికొస్తాను"

"రా" గుమ్మానికి అడుతప్పుకున్నాడు.

వొచ్చింది

"కూర్చుంటావా శెల్వీ?"

కూర్చుంది మంచంపక్క తననిజేర్చి.

అతనికి చాలా వింతగా వుందాపిల్ల ప్రవర్తన.

"యెందుకొచ్చావ్?" ప్రశాంతంగా అడిగాడు శ్రీపతి.

"నాకో పదిరూపాయలు కావాలి" ముక్తసరిగా అంది శెల్వి.

"యెందుకంట?"

"మా యింట్లో అన్నంవొండి వారం ఐంది"

ఫేంటు జేబులోంచి పదిరూపాయలు తీసి శెల్వికిచ్చాడు.

"పూరికినే నా కొద్దు"

"మరి?"

"న...న... నన్నేదన్నా చేసి తీసుకో"

"యేం చెయ్యాను విన్ను?"

శ్రీపతి ప్రశ్నకి జవాబియ్యకుండా పైట తీసింది. జాకెట్టు కూడా తియ్యబోతుంది.

అమె ప్రవర్తనకి శ్రీపతి ముఖంమీద్నుంచి చెమటలు పోశాయ్. చెమటలు కాల్వలై పారుతున్నాయ్.

"శెల్వి..... అగు" అరిచాడు.

మౌనంగా వుండిపోయింది శెల్వి.

"యెవరు చెప్పారు ఈ పని చెయ్యమని?" అడిగాడు.

"యెవరూ చెప్పలేదు అన్పించింది"

"యిదికాదు మార్గం వెళ్ళు. యింకెప్పుడూ యిలా ప్రవర్తించకు. వెళ్ళు...వెళ్ళు."

శెల్వి వెళ్ళిపోయింది.

•  •  •

ఆ మరుసటి నెలలోనే శెల్వికి పెళ్ళి అయింది. వో ముసలి హయ్యరుతో అతను సాంప్రదాయపరంగా చాలా విష్టగలవాడు.

శెల్వి వాళ్ళ కుటుంబం అల్లాడి యింటికి తిరుచ్చిరాపల్లి తరలి వెళ్ళిపోయింది.

శ్రీపతి చిరుద్యోగం కాస్తా యెగిరి పోయిందా

నెలలో. తను పనిచేసేది ఓ ప్రయివేటు కంపెనీ. ఆ కంపెనీ సిన్మావాళ్ళు తీసి పారేసిన వేస్ట్ ఫిల్మ్ లోంచి వెండి తీస్తారు.

రోజూ ఆఫీసులో ఈ ప్రపంచంలో కన్పించే కుళ్ళునీ - గిజాటునీ గురించి వుపన్యాసాలు యిస్తున్న శ్రీపతి గురించి ఆ రోజే తెల్సింది వాళ్ళ ప్రొప్రయిటర్ కి. వీడెవడో లాగున్నాడు అని వెంటనే పీకేశారు వుద్యోగం లోంచి.

మంచీ-చెడూ అనే న్యూనతా భావం లేకుంటే యీ ప్రపంచంలో నిరుద్యోగ సమస్య వుండదేమో అన్పిస్తుంది యెప్పుడన్నా.

పని మానేసిన వారానికి మరో చోటులో యింకో కొత్త పని దొరికింది శ్రీపతికి.

ఆ పనిలో చేరిన రోజు రాత్రి చాలా విచిత్రంగా నవ్వుకున్నాడు శ్రీపతి.

ఆ పని.

వో బ్రోతల్ లాడ్జిలో మేనేజర్ పని. ఆ బ్రోతల్ లాడ్జి కోడంబాకం ఓవర్ బ్రిడ్జి డౌన్ లో వుంది.

ఆ లాడ్జిలో యిరవైకి ఆపైన అమ్మాయిలుంటారు. ఆంధ్రా నుంచి సినిమాల్లో వేషాలేద్దామని యింటిదగ్గర వెర్రి వేషాలేసుకొచ్చి యిక్కడ రెంటికి చెడ్డ అమ్మాయిలకి శ్రీత కల్పం ఆ లాడ్జి.

ఆ లాడ్జిలో మేనేజర్ పని అంటే యిక ఆ పని గురించి వివరాలూ-వర్ణనలూ యెందుకూ పని లేక।

ప్రపంచంలో వున్న కుళ్ళునీ – ధౌర్భాగ్యాన్నీ - కుట్రల్నీ - కౌటిల్యాన్నీ వో సారి సర్దాగా చూస్తానని యెవరన్నా సర్దా పడితే ఆ బ్రోతల్ లాడ్జి చూపించొచ్చు. అక్కడ కన్పించే చీకటినీ, గాలి అసలు రాని ఇరుకు ప్రపంచాన్నీ అక్కడ బాగా వర్ణించి చెప్పచ్చు.

'స్వరాజ్యం' అనే అమ్మాయి ఆ లాడ్జిలో సంవత్సరం నుంచి వుంటుంది. ఆ పిల్ల తత్వం చాలా విచిత్రమైంది. డబ్బున్నప్పుడు విచ్చలవిడిగా ఖర్చు చేస్తుంది. రెండు గుప్పిళ్ళల్లో చిల్లర డబ్బులు వేసి గలగల్లాడించడం అంటే ఆ పిల్లకి చాలా సరదా. అలా గలగల్లాడించి, తనుండే ఆ గదంతా చెల్లా చెదురుగా విసిరేస్తుంది. డబ్బులేక పరమ దరిద్రావి్న అనుభవిస్తున్నప్పుడు ఆ డబ్బులన్నీ యేరుకుని లాడ్జి రూమ్ బోయ్‌ని పిల్చి యిడ్లీలు తెప్పించుకుతింటుంది.

'స్వరాజ్యం' అంటే ఆ లాడ్జి వోనర్‌కి చాలా భయం - చాలా యిష్టం. స్వరాజ్యం చాలా అందంగా వుంటుంది. ఆ పిల్ల మనసు వో గజిబిజి అల్లికల తుట్ట. చాలా గర్వం-చాలా కోపం - చాలా, చాలా అమాయకత్వం ప్లస్ 'స్వరాజ్యం'.

ఆ లాడ్జిలో చేరినప్పటి నుంచీ అశాంతి మరింత పెరిగిపోతుంది.

ఆదివారం ట్రస్టుపురం సెంటర్‌లో నిలబడ్డాడు. ఆ జంక్షన్‌లో పరస్పర దబ్బారాయుళ్ళు చాలా అధికం. బూతు పత్రికల ఎడిటర్లూ సాయంత్రమైతే ఆ సెంటర్‌లో కల్సి పత్రికల స్థితిగతుల గురించీ ఈ నాడొచ్చే సాహిత్యం గురించీ చర్చలు చేస్తుంటే శ్రోతలు వినడానికి చాలా సొంపుగా వుంటుంది. ఆదే జంక్షన్‌లోనే సిన్మాల్లో పనిచేసే అసిస్టెంట్ డైరెక్టర్లూ - పని లేక తిరిగే ప్రొడక్షన్ మేనేజర్లూ కూడా కన్పిస్తుంటారు.

శ్రీపతికి మురళీకృష్ణ అనే పనిలేని అసిస్టెంట్ డైరెక్టర్ పరిచయం అయ్యాడు.

"ఈ సృష్టిలో మనిషికీ మనిషికీ మధ్య ఇంటిమెసీ ఏర్పడాలంటే ముందు హృదయ కాల్యం క్షాళనం కావాలి సార్. అప్పుడు మనిషి వూపిరిరాని భూగర్భంలో కెళ్ళినా

బ్రతికియ్యేచ్చు హాయిగా" అన్నాడు మురళీకృష్ణ.

"సోషల్ రిఫార్మేషన్ అని అరిచిన వాళ్ళల్లో కనీసం నూటికి ఇరవైమందయినా ఆచరణలో పెరిగితే ఈనాటి పరివర్తన తప్పకుండా ఏర్పడును"

"నిజమే. మీరనే యిరుకు కాస్తా నశించిపోను. ఈనాడు మళ్ళీ మనలాంటి వాళ్ళెవరయినా ముందుకొస్తే మరో నూరేళ్ళకి..." అని నవ్వేశాడు మురళీకృష్ణ.

"అద్సరే ముందు మనిషి తనలో ఈర్ష్య – కల్మషాల్ని తుడిచేసుకోవాలి కడిగేసుకోవాలి. యెలా?"

"ముందు అవగాహన అవసరం."

"ఈ అవగాహనతో యింత పెద్ద సిటీలో నేను విశాలంగా బ్రతకగలనా?"

"లాభం లేదు మేష్టారూ? కష్టం...యేదైనా పల్లెటూరికి పారిపోండి...అక్కడి జనంలో మనం యిందాక అనుకున్న ఇంటిమేసీని నెలకొల్పండి."

"నేను పల్లెటూరి వాణ్నే...మాది చిత్తూరు జిల్లాలో మదనపల్లె అవతలి దుర్గం."

"ఐతే...తిరిగి అక్కడికే పారిపోండి మేష్టారూ?"

"అక్కడ శాంతి లేదని యిక్కడికి పారిపోయొచ్చాను" అన్న శ్రీపతి మాటకి పకపకా నవ్వేశాడు మురళీకృష్ణ "ముందు వెంటనే పారిపోండి మేష్టారూ! యీ ప్రపంచాన్ని మార్చాలంటే వో సంఘ సంస్కర్త— వో రాజకీయనాయకుడు– వో పత్రికా సంపాదకుడూ వాళ్ళలో వొక్కడుగా యెవడూ సాధించలేడు. ఒక యూనిటీ ఏర్పడాలి. ముందు మీరు మీ వూరు పారిపోండి. అక్కడే వో అలకాపురిని నిర్మించండి. అక్కడే మీ ఇరుకు పోగొట్టి శాంతిని నెల కొల్పండి." అని నాన్ స్టాప్‌గా మాట్లాడాడు మురళీకృష్ణ.

అతని మాటల్ని మౌనంగా వింటూ వుండిపోయాడు శ్రీపతి.

• • •

యెంతటి అతిలోక సౌందర్యరాశి గానీండి — యింకెంతటి అనిమిషకాంత గానీండి ఆ లాడ్జికి వొచ్చిన యే అమ్మాయి లైఫ్ సంవత్సరంన్నర.

స్వరాజ్యం ఆ లాడ్జికి వొచ్చి రెండేళ్ళు దాటుతోంది ఇప్పుడు.

ఆ లాడ్జిలో ఆమె పరిస్థితి యిప్పుడిప్పుడే దిగజారి. ఆమెదేహంలో సుఖరోగాలు బాధల ప్రభావం యిప్పుడిప్పుడే ప్రత్యక్షంగాకన్పించి, అవయవాల పొందికని దిగజారుస్తుంది.

స్వరాజ్యం ఎంతడిగినా యిచ్చెయ్యి అని పూర్వం శ్రీపతితో చెప్పిన లాడ్జి వోనరు అదేం అడిగిన యివ్వదు అని శాసించాడు.

ఆ మధ్యాహ్నంవేళ మేనేజరు కౌంటర్ దగ్గర కొచ్చి "యేయ్ మేనేజరూ నాకు వో పాతిక రూపాయలు కావాలి. యిలాపారెయ్" అందివాలా నిర్లక్ష్యంగా,

మెనేజర్ శ్రీపతి ఆమె కళ్ళల్లోకి చూశాడు. ఎండి ఎట్టిటి జీరల్తో అసహ్యంగా వున్నాయి స్వరాజ్యం కళ్ళు.

"యేంటా చూపు...... డబ్బు." అని కళ్ళతో సైగ చేసి చూపింది .

"వోనర్ యివ్వద్దన్నాడు." శ్రీపతి చెప్పాడు.

"ఆడెవడు ?"

"సాయంత్రం వస్తాడు అడుగు."

"ముందు నిన్నడుగుతున్నాను."

"నా వల్లకాదు" అన్నాడు శ్రీపతి.

"పాసింజర్ యిచ్చింది తీస్కోడం వల్లవుతుందా" కచ్చిగా అంది స్వరాజ్యం.

"నువ్వు అధికంగా మాట్లాడుతున్నావ్"

"నువ్వు రోజూలా యిస్తే యెందుకు మాట్లాడ్తాను."

"వోనర్ చెప్పిందంతా చెయ్యడం నా డ్యూటీ. అతను యివ్వద్దు అన్నాడు యివ్వను. నువ్వు అరిచి గీ పెట్టినా మరి యివ్వను." కచ్చితంగా అన్నాడు శ్రీపతి.

రుసరుసలాడుతూ, శోకలెడుతూ, అక్కడ్నుంచి వెళ్ళిపోయింది స్వరాజ్యం.

సాయంత్రం ఓనర్ వొచ్చాడు. శ్రీపతి పరిస్థితి చెప్పాడు.

"యీసారి వొచ్చి అలా అడిగితే పొమ్మని చెప్పు. నేనూ రేపో ఎల్లుండో పంపేద్దామని చూస్తున్నా" అన్నాడు. ఓనర్.

"సరే" అని తలూపాడు శ్రీపతి.

అనంతరం ఆలోచిస్తూ వుండిపోయాడు శ్రీపతి.

• • •

ఆ రోజు నైట్ డ్యూటీ -

రాత్రి పన్నెండయింది. నిద్రరావి శ్రీపతికి స్వరాజ్యం గదిలోంచి యేవో మూలుగులు విన్పిస్తున్నాయ్.

ఆ గదికి దగ్గరగా వెళ్ళాడు శ్రీపతి. స్వరాజ్యం ఆ లోపల రోగాలబాధలతో రౌద్రవ నరకాన్ని అనుభవిస్తుంది. విలవిలా కొట్టుకుంటుంది.

• • •

మరో నెలకి ఆ లాడ్జిలోంచి వెళ్ళనంటే రూమ్‌బాయ్‌ల చేత ఆ మిట్టమధ్యాహ్నం బరబరా ఈడ్పించాడు లాడ్జి వోనర్.

యింతకాలం యీ ప్రదేశంలో అపరస్వర్గాన్ని చవి చూసిన స్వరాజ్యాన్ని అలా ఈడ్చేస్తుంటే శ్రీపతి కళ్ళు చూడలేకపోయాయ్. శ్రీపతి దేహం విలవలేక పోయింది.

ఆ సాయంత్రమే తన పనికి తిలోదకాలిచ్చి మాయ మద్రాసు నుంచి విశాలమైన చెన్నపట్నంనుంచి దూరంగా తనవూరు దుర్గానికి పారిపోయాడు శ్రీపతి.

# 8

గతమంతా కళ్ళముందు నుంచి పారిపోయి వర్తమాన దశ మిగిలిపోయింది.

తెలతెలవారుతున్నట్టుంది కోళ్ళు కూస్తున్నాయ్.

రాత్రినుంచి సిగరెట్ మిద సిగరెట్ కాలుస్తూ గత స్మరణలో వున్న శ్రీపతి వర్తమానంలో పొగనిండిన ఆ చిన్నగదిలో వుక్కిరిబిక్కిరి ఔతున్నాడు.

కిటికీ రెక్కలు తీశాడు. సిగరెట్ల పొగ కిటికీలోంచి బయటికి ప్రసారం ఐంది.

మంచంమీంచి లేచి స్నానాదికెళ్ళి, గుడికెళ్ళడానికి సంసిద్ధుడవుతున్నాడు శ్రీపతి.

• • •

మధ్యాహ్నం స్కూలునుంచి యింటివేపు వెళ్తున్న టీచర్ ఫాతిమాని చూశాడు బుచ్చిరెడ్డి.

యెంతటిదీ యీ ఫాతిమా.

సరే దీని అంతుచూడకుండా పోతానా? యెప్పుడో చూద్దును. కాని జనంమధ్య నాకున్న గొప్పపేరంతా పోతుం దన్న భయం. సరే చూస్తాను చూస్తాను. అనుకున్నాడు ప్రెసిడెంటు బుచ్చిరెడ్డి.

• • •

"ఏమంటావ్ మన విషయం?"

"యే విషయం ఫాతిమా?"

"అదే మనం యీ వూరికి దూరంగా మద్రాసు పారి

పోయి అక్కత పెళ్ళి చేసుకుని హాయిగా సంసారం చెయ్యాలనుకున్న విషయం?"

"చూడు ఫాతిమా?"

చూసింది ఫాతిమా

"పెళ్ళనేది నేను చేసుకోవడం యింతట్లో సాధ్యం కాదు. ఫ్యూచర్‌లో నేను చేసుకున్నా అది యెవరితోనో చెప్పలేను. ఇందా! యిక మద్రాసు సంగతి. యీ జన్మకి నేనీ ప్రాంః విడిచిరాను" శ్రీపతి అలా విషలంగా- నిర్భయంగా- నగ్నంగా చెప్పేసరికి తోక తొక్కిన రేచుగొడ్డులా లేచింది ఫాతిమా——

"యీ ఆలోచన్లనీ కడుపులో పెట్టుకున్న వాడివి నాతో యిన్నాళ్ళూ యిలా యెందుకు ప్రవర్తించావ్? వొక పెళ్ళికాని ఆడదానితో యిలా ప్రవర్తించడానికి సిగ్గులేదూ? వుండు రేపు వాళ్ళో చెపుతాను నీ బ్రతుకేమవుతుందో"

"వాళ్ళేకాదు దేవుడికి మొర పెట్టుకో. నీమాటలకి ఈశ్వరుడు లొంగుతాడేమో!"

"ఐతే ... మరైతే ... యివన్నీ ... నాకు యిన్నాళ్ళు యెందుకు చెప్పలేదు?" రోషంగా చూస్తూ అంది ఫాతిమా.

"నాకు ఆ అవకాశం యివ్వకుండా మీది మీదికొచ్చి నా ప్రాణాలు తీశావ్... ఐనా నా హద్దులు దాటలేదు. యింకో మగాడిలా ప్రవర్తించలేదు."

"నేనేం మీది కొచ్చాను. నువ్వే నన్నలా చేశావ్"

"నే నెవర్నీ యెలానూ చెయ్యలేదు ఫాతిమా! కొందరు... కొందరు అకారణంగా నామీద పడతారు ... నా ఆలోచన్లు విని పారి పోతారు... లేదా నేనైనా పారి పోతాను."

"మహా అపర మన్మధుడవనీ... నీకంటే రారాజులు

నా వెంట పడ్డారు యీ వూళ్ళో ... కానీ నేను నీకోసం ఆరాటపడ్డాను."

"ఫాతిమా!... నాకోసం నువ్వు యెందుకు ఆరాట పడ్డావో నాకు తెలుసు. వెళ్ళు ... వెళ్ళి ఆ రారాజుల్ని కట్టుకో చూసి ఆనందిస్తాను."

"తప్పకుండా కట్టుకుంటాను గానీ ... ముందు నీ కోసం నేనెందుకు ఆరాటపడ్డానో చెప్పు... విన్నాకనే నేను ఇక్కడ్నుంచి వెళ్ళేది."

"యింత ఆరాటం నీకుంటుందని నాకూ తెలీదు. సరే విను ఈ వూళ్లో యెవరు నిన్ను చేరదీసినా కొద్ది కాలమే నిన్ను వుపయోగించుకుని వొదిలేస్తారు. నీఆరాటం ఏమిటంటే, నీకు గుండె జబ్బుంది. యెవరైనా క్షుద్రాదితో నీకు ముడిపడితే వాడితో శాశ్వతంగా జీవితం గడుపుదా మని... నా మాటల్లో అబద్దం లేదు కదూ? నా అంచనా తప్పు కాదు గదూ?" అని ఫాతిమా కళ్ళల్లోకి చూశాడు.

ఆ దెబ్బలో ఫాతిమాకి నోటి నుంచి మాట రాలేదు. ఆమె వొళ్ళంతా చెమటలు పట్టాయ్. జబ్బున్న బలహీనపు గుండె వేగంగా కొట్టుకుంది.

"నే...ను నేను నువ్వు లేకపోతే బ్రతకలేననుకోకు నీకంటే చాలా విషయాల్లో చాలా గొప్పవాడైన మన వూరి ప్రెసిడెంటుని నేను తప్పకుండా పెళ్ళి చేసుకుని తీరతాను" కసిగా అని అక్కణ్నుంచి వేగంగా వెళ్ళిపోయింది ఫాతిమా,

'దండకారణ్యంలో వింత జంతువులు' అనుకున్నాడు శ్రీపతి.

• • •

ప్రెసిడెంటు బుచ్చిరెడ్డి అతని మిత్రత్రయం ఆ అరుగు మీద కూర్చున్నారు. కొత్త పూజారి శ్రీపతిని యెక్కడ పెద్ద తప్పు పడదామా యెక్కడ తీసేద్దామని

యెదురుచూస్తున్న వాళ్ళకి చాలా పెద్ద తప్పే దొరికింది.

"నిన్న రాత్రి నేను చూశాను. ఏటి వొడ్డు చింతల తోటపక్కన వాళ్ళిద్దరూ కబుర్లాడుకుంటున్నారు. ఆ ఫాతిమా దాని మిడిసిపాటు వల్లమాలిన్ది" ఆత్రంగా అన్నాడు రాజేశ్వరరావు మేష్టారు.

ఆ మాటలు వినడంతోనే ప్రెసిడెంటు బుచ్చిరెడ్డి నోట్లో చుట్టనుంచి గూడ్స్ రైలింజను పొగలా దారాళంగా వొదలబడింది. ప్రెసిడెంటు వొకలా చాలా సంతోషించినా యింకోలా చాలా చాలా మండిపడ్డాడు. అతను గుండెల్లో శతఘ్నలు పేలాయ్. అతని నాసాపుటాల్నుంచి వేడి నిశ్వాసం బయల్పడింది.

"నేను యెంతగానో పరితపించే ఆ స్కూల్ టీచర్ ఫాతిమాని వాడు వలలో వేసుకుంటాడా! చెప్తాను వాళ్ళ పని. రేపు పదిమందిలోనూ పంచాయతీ చేసి యిద్దర్ని బ్రతికి వుండగానే చంపేస్తాను" అనుకున్నాడు ప్రెసిడెంటు బుచ్చిరెడ్డి.

యింకా రాజేశ్వర్రావు మేష్టారు వివరాలు చెపుతుంటే ప్రెసిడెంటు బుచ్చిరెడ్డి శరీరం వశం తప్పుతోంది. తనకి తెలుసు యీ రాత్రి గ్యారంటీగా నిద్రరాదు.

వాణ్ని...యీ శ్రీపతిగాణ్ని వుప్పుపాతర వెయ్యాలి. గానీ బుద్ధిరాదు. యిన్నేళ్ళు వాడి ప్రవర్తనని సహించాడు. యీ రోజు తన వ్యక్తిగత విషయం. అందునా స్త్రీ విషయములో జోక్యం చేసుకున్నాడు వాడు. యిక లాభం లేదు వాణ్ని వెంటనే తరిమెయ్యాలి వూర్నుంచి. మళ్ళీ రాకుండా రాకుండా చేసెయ్యాలి.

ఆ రోజుకి మిత్రులు విడిపోయారు.

అరుగుమీంచి లేచి ఇంట్లో కెళ్ళాడు బుచ్చిరెడ్డి

బుచ్చిరెడ్డి భార్య స్వర్గస్తురాలయి చాలా యేళ్ళ

యింది. భార్యపోయిననాటినుండీ దాలమ్మ అనే వో ముస
లామెని వంట చెయ్యడానికి నియమించాడు. బుచ్చిరెడ్డికి
సంతానంలేదు. అందుకని వేలువిడిచి, స్వర్గం వెళ్ళిన చెల్లెలి
కొడుకు గంగాధర్నాన్ని దత్తత చేసుకున్నాడు. వాడు
హైదరాబాదులో ఎమ్మే చదూతున్నాడు రేపో మాపో
వస్తాడు.

"బాబు భోం చేస్తారా ?" అంటూ వచ్చింది వంట
మనిషి దాలమ్మగారు.

"నువ్వు తినేయ్. యీ పూటకి సహించటం లేదు."
అన్నాడు పందిరి మంచంమీద పడుకుంటూ.

"సరే" అనేసి వెళ్ళిపోయిలది దాలమ్మగారు.

బుచ్చిరెడ్డికి గుండెల్లో యిందాక అరుగుమీద రాచు
కున్న గంధపు కట్టెలు యిప్పుడు మంటలయి పొగల్ని -
సెగల్ని కమ్ముతున్నాయి ముక్కు పుటాల్లోంచి.

బుచ్చిరెడ్డికి గతంలో మూడేళ్ళక్రితం యీ దురం
గ్రామంలో యీ శ్రీపతిగాడు చేసిన వెదవ పనులన్నీ
గుర్తొస్తున్నాయి.

శ్రీపతిగాడు తనకి అవమానం అన్యాయం చెయ్యా
బోతే తను తెలివిగా వాడ్ని వూరివాళ్ళ కళ్ళముందు యెలా
రౌడీగా చేసిందో గుర్తొస్తోంది.

యీ శ్రీపతిగాడు మదనపల్లెలో చదువుగానిచ్చి వస్తూ
యేవో పుస్తకాలు చంకన వేసుకొచ్చాడు వెదవ.

ఆ పుస్తకాలన్నీ వూరిచివర ఏటిగట్టుదగ్గర కూర్చుని
తెగచదివేసి సంఘసంస్కరణా-జనాల హృదయాల్లో ఈర్ష్య
నశింపు అప్పుడే జనంమధ్యలో శాంతీ. స్వేచ్ఛా నెలకొలుపూ
అనేసి లెక్చర్లు యిచ్చేవాడు సన్నాసి.

వీడి వాగుడుకి ప్రవర్తనకి జనం యెక్కడ పాడై
పోతారో అని తనకి అంటే ప్రెసిడెంటు బుచ్చిరెడ్డిగారికి

తెగ బాధకలిగేది. తనేం చెయ్యలేక పోయేవాడు. కొబ్బరి ముక్కంత గుండెకాయ తెగకొట్టుకునేది.

వోరోజు తెల్సింది పీడు తెచ్చిన పుస్తకాల్లో కొన్ని ప్రభుత్వం నిషేధించినవి కూడా వున్నాయని.

వెంటనే తను పోలీసుల్ని రప్పించాడు.

వొచ్చిన పోలీసులకి శ్రీపతిగాడు చదివే పుస్తకాలన్నీ దొరికాయ్. వాళ్ళు పీడ్ని బేడీలువేసి మరీ తీస్కెళ్ళారు.

యీ దుర్గం గ్రామపు పాటకపు జనానికి పోలీసులంటే చాలాభయం. అందునా యీ వూరికి పోలీసులు మొట్టమొదటిసారి రావడంతో మరీ భయపడిపోయారు.

పోలీసులు యెవర్నయినా పట్టుకు తీస్కెళ్ళుంటే యీ వూరిజనం దృష్టిలో ఆ పట్టుబడ్డవాడు వో దొంగో-రౌడీనో-లేక హంతకుడో అయ్యివుంటాడు.

ఆ కారణంగా మొట్టమొదటిసారి శ్రీపతిగాడు జనం దృష్టిలో పెద్దరౌడీ వెదవయ్యి కూర్చున్నాడు. విడుదల అయ్యివచ్చాకా వాడు రోడ్డుమీద వెళ్తుంటే జనం జడుసుకునే వారు. వాళ్ళ పిల్లల్ని పీడితో కలవవిచ్చేవారు కాదు.

పీడికి వూళ్ళో మర్యాద పోయింది. విలువ - గౌరవాలు నశించాయి.

ప్రెసిడెంటుగారనే జనం ప్రెసిడెంటు బాబు అన్నారు. కేదారేశ్వరుడి పూజ మొదలెట్టేసరికి పరమభక్తుడన్నారు.

• • •

విడుదలై వచ్చినవాడు తిన్నగా వుండక మళ్ళీ వూరి విషయాల్లో కలగజేసుకోవడం మొదలెట్టాడు. వెధవకి మొదట్నుంచీ నోరూ-కాళ్ళూ అసలు తిన్నగా వుండవు.

సోమయాజిగా పేరెల్లిన మాధవాచారిగారి కడుపున యిలాంటి తుంటరి బుద్ధులున్న వెధవ పుట్టడం ఆయన గత జన్మలో చేసుకున్న పాపం.

వీడు మాలాళ్ళ పెళ్ళికి మాదిగాళ్ళ పెళ్ళికి సిగ్గు శరం లేకుండా అంటూ ఆడంబరం వుండకుండా ధైర్యంగా! అంటూ పోయి వాళ్ళ యిళ్ళకి పందిళ్ళు వేసి వాళ్ళ యిళ్ళలో తిండి తిని సమైక్యతావాదం వల్లకాడూ అనేసి పిచ్చ ప్రేలుళ్ళు పేల్తుండే వాడు.

అదే సమయం చూసి తను వూరికి దూరంగా పడి యేడుస్తున్న ఆ రెండు పేటల వాళ్ళనీ వూరికి ఆన్చివున్న తన పొలంలోకి రమ్మని కబురు పంపాడు. ఆ దెబ్బతో తన పేరు మారు మ్రోగింది వూరంతా ప్రెసిడెంటుబాబు గారు ధర్మ ప్రెబువులన్నారు జనం.

వాళ్ళనలా రమ్మనటం వెనక చాలా కథుంది. వూరిని ఆన్చి వున్న పొలం తనదిగా చెలామణీ ఔతుంది గానీ నిజా నికి ప్రభుత్వం ఆ మధ్యే తనకి నోటీసుకూడా యిచ్చింది. ఆ పొలంలోకి వాళ్ళని నెట్టి వూరికి దూరంగా వాళ్ళుండే ఆ నెలలో తను టమేటా చేను వేసుకుని సొంతం చేసు కుందాం అనుకున్నాడు.

అనుకున్నట్టే అంతా జరిగిపోయింది.

కానీ——

యింతలో యీ పానకంలో పుడకగాడు ప్రభుత్వానికి యీ విషయం తెలియజెయ్యాలని ప్రయత్నిస్తుంటే చాలా విషయాల్లో వాటాదారులు ఐన తన ముగ్గురు మిత్రులతోటీ తను ఆలోచించి వొక పథకం తయారు చేశాడు.

ఆ పథకం పారింది.

తెల్లవారే సరికల్లా ఆ చుట్టుప్రక్కలకి ప్రసిద్ధి ఐన తమవూరి కేదారేశ్వరుడి ఆలయం ముందు గంటలు మాయం అయ్యాయ్. ఆ గంటలు యెవరు తీశారా? అవి తనూ తన మిత్రులూ తమ దైవం గంటలు పోయాయని. తమకి యిక యీ వూళ్ళో పుట్టగతులు వుండవని

తెగ దుఃఖిస్తుండగా, ఓరోజు యీ శ్రీపతిగాడు కూర్చునే వూరి చివరి యేటిగట్టు దగ్గర పాతి పెట్టబడి వున్నాయని తేలింది.

వూరిజనం శ్రీపతిని చంపెయ్యబోతే తను చిన్నగా జనాన్ని ప్రాధేయపడ్డాడు.———

"అమ్మా! బాబూ! పోయిన ఈ గంటలు తిరిగి దొరికాయి. మన ఆరాధ్యదైవం మనల్ని కొంత గాకుంటే కొంతయినా క్షమిస్తాడు. యీ కాస్త దానికే మీరు అన్యం పుణ్యం యెరగని యీ అబ్బాయిని ఏమి చెయ్యకంఠి" అని ప్రార్థన ధోరణిలో ప్రాధేయపడటంతో జనం శ్రీపతిని ఏమి చెయ్యకుండా వొదిలేశారు.

ఆ దెబ్బతో దేవుడిమీద తనకి యెంతటి భక్తి ప్రపత్తులు వున్నాయో వూరి జనానికి అర్థమయింది. జనం తనని ప్రెసిడెంటు బాబు పరమ భక్తులు అని ఆకాశానికి యెత్తేశారు.

అదే దెబ్బతో ఈ తుంటరి శ్రీపతిగాడు ఈ దుర్గం గ్రామం నుండి మర్నాడు తుస్సున పారిపోయాడు.

• • •

అక్కడ యే పెంట బ్రతుకు బ్రతికాడో సన్నాసి. మూడేళ్ళ తర్వాత తిరిగి ఈ వూరొచ్చాడు.

పూజారి మాధవాచారిగారు బాగా ముసలివారై పోయారు.

ఖర్మ ఈ గుడికి వాళ్ళ వంశమే అర్చన చెయ్యాలి అనే రూలు వొకటి యేడిసింది. ఆ రూలు ప్రకారం మాధవాచారిగారి అనంతరం ఈ తుంటరి శ్రీపతిగాడు గుడికి పూజారి కావాల్సి వస్తోంది.

వో రోజు పందు ముసలి మాధవాచారిగారు అరుగు మీద కూర్చున్న తమ నలుగురు మిత్రుల దగ్గర కొచ్చి—

"బాబూ! చూస్తున్నారుగా! యిక ఆ ఈశ్వరుడికి అర్చన చెయ్యలేను. అబ్బాయి నా స్థానంలోకి వస్తాడు" అన్నాడు.

ముసలాయన మాటలు కాస్త కోపం తెప్పించినా యింక తప్పక "వూఁ అనాల్సి వొచ్చింది.

వాడు చేసిన యేదో చిన్న తప్పుని పెద్దదిగా విస్తీర్ణం చేసి వాణ్ని వీడి వంశం అర్చన చెయ్యాలన్న రూలుని పీకి పారెయ్యాలని నిర్ణయించుకున్నాడు తన మిత్రులతో ఆలోచించి,

అనుకున్నట్టుగానే ఈ వెధవ తన గుండెల్ని మంటించే పెద్ద తప్పు చేస్తున్నాడు. తన ఫాతిమా టీచర్‌ని వలలో వేసుకున్నాడు. ఇక వాడి పని రేపుంది అని ఆ రాత్రికి యెలాగో బాధగా నిద్ర పోయాడు. వూరికి ప్రెసిడెంటూ పరమ భక్తుడూ చిన బుచ్చిరెడ్డి.

# 10

రాత్రంతా నిద్రలేని కారణంగా మర్నాడు ఉదయం ఏడు గంటలకిగానీ లేవలేకపోయాడు ప్రెసిడెంటు బుచ్చిరెడ్డి.

వీధి అరుగుమీద కూర్చుని పందుంపుల్లతో ముఖం కడుగుతుంటే మళ్ళీ యివేవో వాలగా గుర్తొస్తున్నాయి. కసిగా పందుంపుల్ల చివరలు కొరికి వూస్తున్నాడు.

యింతలో స్కూలుకు వెళ్తున్న ఫాతిమా తెల్లచీరలో దర్శనం యిచ్చింది.

బుచ్చిరెడ్డి గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయ్. కసి పొంగుతుంది ఆంతర్యంలో కన్పిస్తుంది నిద్రలేచిన తన ముఖంలో

పోతున్న ఫాతిమా బుచ్చిరెడ్డి కేసి చూసింది.

బుచ్చిరెడ్డి చూశాడు.

వోరగా చూస్తూ నవ్వింది ఫాతిమా.

పెదాలు మరింత సాగదీసి మగాణ్ని సుడిగుండంలో తోసేలా మళ్ళీ నవ్వింది ఫాతిమా.

అంతే. బుచ్చిరెడ్డి గుండెలు వేగంగా మరెంతో వేగంగా కొట్టేసుకున్నాయ్. పాపం బుచ్చిరెడ్డి అన్నే నరుడు హృదయం తుఫాను గాలికి ఊగే పువ్వులా ఊగింది. ముఖంలో కసి గాలికెగిరి ఆనందం చోటు చేసుకుంది. అదే ముఖంలో.

అలా వెళుతూ వెనక్కి తిరిగి చూసి నవ్వుతూ వెళ్ళింది ఫాతిమా.

బుచ్చిరెడ్డి మనసు సంగతింక చూడాలి. రాత్రినుంచి ఈర్ష్యా-క్రోదాలతో నిండిన మనసు యిప్పుడు వెన్నెల్లో కలిసిన కరివేరపు పువ్వులా అయింది. తయారయింది.

రాజేశ్వరరావు మేస్టరు అబద్ధం చెప్పాడని ఆ క్షణం లోనే బుజువయింది బుచ్చిరెడ్డి మనసులో.

గబ గబా ముఖం కడుక్కుని యింట్లో కెళ్ళితే దాలమ్మగారూ "బాబూ! చద్దన్నం తినరూ?" అనడిగింది.

"వద్దు...కాఫీ పట్రా'' అన్నాడు పిచ్చహుషారుగా.

దాలమ్మగారు తెచ్చిన కాఫీ చాలా వేడిగా వున్న పెద్ద పెద్ద గుటకలు వేస్తుంటే నాలుక కాలుతున్నా సరే వేగంగా మింగేస్తున్నాడు. ముక్కు పుటా లెగరేస్తున్నాడు.

మధ్యాహ్నం స్కూలు నుంచి వో కొంది లాగేసుకున్న కుర్రాడొచ్చి వో చీటీ యిచ్చి తుర్రున పారిపోయాడు.

ఆ చీటీ చదువుకున్న బుచ్చిరెడ్డి ఆనందంతో చాలా కంగారుపడ్డాడు.

రాత్రికి ఏటిగట్టుదగ్గర చింతలతోటలో కలవమని వుంది దాంట్లో.

బుచ్చిరెడ్డి రాత్రి యెప్పుడొస్తుందా పగల్నెవ్వడు మింగేస్తుందా అని చూస్తున్నాడు.

# 11

రాత్రి వొచ్చింది—

యథాప్రకారం యేటివొడ్డున కూర్చుని సిగరెట్లు కాలుస్తున్నాడు శ్రీపతి. బాగా పొద్దుపోయింది.

గట్టున ఆన్చివున్న చింతలతోట చీకటిలోంచి యేవో మాటలు విన్పిస్తున్నాయ్.

"రాజేశ్వర్రావు మేస్టరు చెప్పాడు. ఆ శ్రీపతిగాడు నిన్ను వలలో వేసుకున్నాడటగా!"

"వాడ్ని నేను అసహ్యించుకుంటాను నిత్యం... మీ రాజేశ్వర్రావు మేస్టారు చెప్పింది అబద్ధం"

"అసలు నువ్వు వాడితో మాట్లాడావా యెప్పుడూ?"

"వాడి మొహం నాతో మాట్లాడ్డానికి ఆ మగాడికి ఎంతధైర్యం వుండాలి!"

"బొన్లే—నాకు తెల్సనుకో ... నేనసలు నమ్మను."

ఆ మాటలు వింటున్న శ్రీపతి నవ్వుకున్నాడు. అలా చాలాసేపు నిశ్శబ్దంగా నవ్వుకుని యింటివేపునడిచాడు.

తల్లి నాంచారమ్మగారు అన్నం వడ్డించి మామూలు నీద మామూలుగానే మొదలెట్టింది—

"ఆ గెడ్డం మీసాలు చేయించ రాదట్రా!"

"యిప్పుడొచ్చిన నష్టమేమిటి?"

"నష్టవా నష్టమున్నరా!... నువ్వు పూజారిగా వుంటున్న రోజునుంచీ గుడికి అసలు భక్తులే రావటం మానే

స్తున్నారట."

"అందుకు నేనెందుకు కారణం ఔతాను?"

"నువ్వే పూర్తిగా కారణమగుట నీ మీసాలూ గడ్డం నీ రౌడీవాటం చూసి యే ఆడదొస్తుంది ఆ గుడికి?"

తల్లిమాటలకి శ్రీపతి నవ్వుకున్నాడు. ఆ పూట యిక అన్నం తినాలనిపించలేదు. కాస్సేపు నవ్వుకుని నవ్వుకుని నిద్రపోవాలన్పించింది. అలాగే చేశాడు.

ప్రెసిడెంటు బుచ్చిరెడ్డి మిత్రుల్తో ఆ సాయంత్రం పూట తన యింటి అరుగుమీద బిశాణా వేశాడు.

"మా మేనల్లుడు గంగాధరం మరో రెణ్నాల్లో వస్తానని రాశాడు." అనేసి జేబులోంచి మధ్యాహ్నం వొచ్చిన వుత్తరాన్ని తీసి చూపించాడు.

"మీ వాడ్ని చూసి చాన్నాళ్ళయింది." అన్నాడు కరణం రామ్మూర్తి.

"ఔను బాగా లావెక్కి యీ పాటికి అందంగా తయారై వుంటాడు" అన్నాడు మున్సబు నరసింహం.

"పట్నం వాసనలు బాగా పట్టి వుంటాయ్." అన్నాడు రాజేశ్వర్రావు మేస్టరు.

గంగాధరం అంశంమీద ప్రసంగం కాస్సేపుసాగాక,

"ఔనూ ... ఆ శ్రీపతి గాడి విషయమేమిటి?" అన్నాడు మున్సబు రామ్మూర్తి.

"యే విషయం?"

"మొన్న మాట్లాడుకున్నాంగా! మళ్ళా యే విషయం ఏమిటి?"

"నిన్న నేను వెళ్ళి ప్రత్యక్షంగా చూసొచ్చాను. మన రాజేశ్వర్రావు మేస్టారి మాట నిజం కాదని తేల్తుంది." అన్నాడు బుచ్చిరెడ్డి.

"ఏమిటీ ఏవన్నారూ? ... శివా శివా... మన కేదా

రేశ్వరుడి మీద ఒట్టు... నేను అబద్ధాలాడతానా?" కూర్చున్న వాడల్లా లేస్తూ హడావుడి పడిపోతూ అన్నాడు నిజంచూసిన రాజేశ్వర్రావు మేస్త్రారు.

"కూర్చోండి బాబూ... కూర్చోండి... నేన్నదని ఆ దృశ్యం మనకి కన్పిస్తే సరిపోతుందా... అది వూరి వాళ్ళకి ప్రప్రథంగా చూపించొద్దూ?"

"ఔను...... అదీ నిజమే'' అన్నాడు మున్సబు నరసింహం.

"అది సరే...... గుడి ఆదాయం మరీ తగ్గిపో తుంది." అనేసి కలగజేసుకున్నాడు కరణం రామ్మూర్తి.

''యెన్నాళ్ళు యీ నష్టం? '' అదేదో వ్యాపారంలా చికాకుపడ్డాడు నరసింహాలుగారు.

"కంగారు పడొద్దు... యీసారి దెబ్బకి యీశ్రీపతి గాడు యీ వూరు విడిచి పెట్టిమళ్ళీ రాకుండా చేద్దాం." అనేసి భరోసాయిచ్చాడు ప్రెసిడెంటు బుచ్చిరెడ్డి.

చర్చ ఆరోజుకి అలా ముగిసింది.

యెవరిళ్ళకి వాళ్ళుపోతే ప్రెసిడెంటు ఫాతిమాకోసం పోయేడు.

# 12

దుర్గం గ్రామంలో కేదారేశ్వరుడి ఆలయంలో ఆ వుదయం గుడి పూజారి శ్రీపతి భక్తులు రాక గుడి మెట్టు మీద కూర్చున్నాడు.

స్కూలుకి వెళ్ళుతున్న ఫాతిమా శ్రీపతిని చూసింది ఆమె చూపుల్లో వజ్రాయుధాలున్నాయ్. మండే సూర్యు డున్నాడు.

శ్రీపతికూడా ఆ స్త్రీకేసి చూశాడు. అతని చూపులు

సామాన్యంగా వున్నాయ్. నరుడికి దేవు డిచ్చిన కళ్ళు చూపుల్లానే వున్నాయ్ అతవి చూపులు.

"చూశావుగా నీకంటే గొప్పవారు రోజు తేడాలో నా పాదాల ముందు వాలాడు" అంది ఫాతిమా మనసు.

ఫ్రీ? నీ అసలు పేరు మాయ అనుకుంది శ్రీపతి అంతర్యామి.

మరో నిర్లక్ష్యమైన బాణం విసిరి ఆమె వెళ్ళి పోయింది.

యిలాంటి ఆడాళ్ళని యెప్పుడో రుచి చూపేసిన శ్రీపతి నిశ్శబ్దంగా తన పనిలో నిమగ్నం అయ్యాడు. పిచ్చి జనం అని మాత్రం అనుకున్నాడు.

# 13

అలా... అలా ఆర్నెల్లు గడిచాయ్.

ఆరోజు రాత్రి యేటిగట్టున కూర్చుని యేటిలో చీకటిని చూస్తున్నాడు శ్రీపతి.

చింతల తోట వెనకనుంచి ఆ చీకట్లో చీకటినుంచి రెండు స్వరాల సంభాషణ ఇటు శ్రీపతి చెవులవేపు ప్రసారము అవుతుంది.

"ఎంతకాలం యిలా ?" అసహనంగా అంటుంది ఆ చీకటిలో వున్న ఫాతిమా.

"యేం... యిలా బాగోలేదా, ఆ చీకటిలోనే వున్న బుచ్చిరెడ్డి అలా అడిగాడు.

'యిలా నాకేమాత్రం బాగోలేదు... యీ రోజు అసలు విషయం తేల్చుకోవాలని వచ్చాను. అసహనంగానే అంది ఫాతిమా.

"ఏమిటి తేల్చుకునేది!" చిరాగ్గా అడిగాడు బుచ్చిరెడ్డి.

"అదే మన పెళ్ళి విషయం."

"పెళ్ళా...!!! బుల బులా _ పకపకా నవ్వేసిన బుచ్చిరెడ్డి "నీకూ నాకూ పెళ్ళి... అసలు నన్నేవరను కుంటున్నావ్ నువ్వు ?

"యీ ఊరి ప్రెసిడెంటువి యీ ఊరి అమాయకపు జనానికి ధర్మ పాలకుడివి. సరేనా ?"

"అవును మరి ... యింతటి ప్రెసిడెంటు గారిని పట్టుకుని పెళ్ళాడమని అవమానిస్తావా ?"

"నీ హోదా నీ భక్తీ జనం యెంత కాలం నమ్ముతారో నేనూ చూస్తాను. రేపే...రేపే నలుగురి మధ్య నిన్ను పెట్టి యేం చేస్తానో చూడు."

"ఏమిటి యేం చేస్తావ్?" కాస్త భయంగా అడిగాడు బుచ్చిరెడ్డి. నిజానికి యెవరికీ భయపడని బుచ్చిరెడ్డిలాంటి వాళ్ళు యీ మార్కు ఆడాళ్ళకే భయపడ్తారు. ఫాతిమాకి నలుగురిమధ్య అరవడం, ప్రచారం చెయ్యడం వచ్చు. ఫాతిమా చదువుకున్న స్త్రీ యీ జనం నమ్మకపోజే ప్రభుత్వానికి పిర్యాదు చెయ్యగలదు. అందుకే బుచ్చిరెడ్డిలాంటి వాళ్ళు తప్పకుండా భయపడి తీరతారు. తీరాలి.

"ఏం చేస్తావ్...యేం చేస్తావో చేస్కోపో" భయంగానే అన్నాడు బుచ్చిరెడ్డి.

"యేం చేస్తానా...రేపు వూరివాళ్ళందరినీ కేదారేశ్వర స్వామి ఆలయం ముందుకి పిల్చి నీ కథంతా బయటపెడతాను. నువ్వు యీ గుడిసొమ్ము యెంత తింటున్నావో చెపుతాను, వూరికి వెనక నుంచి నువ్వు ఎన్ని గోతులుతవ్వావో ఆధారాలతో సైతం నాదగ్గరున్నాయ్. అవన్నీ విడమర్చి జనానికి చెపుతాను. అప్పుడు నిన్ను ధర్మ ప్రభువుగా నమ్మిన జనం-నిన్ను పరమభక్త పుంగవుడుగా నమ్మిన యీ జనం - నిన్ను అమాయకుడుగా నమ్మిన యీ జనం యెలా

కత్తులతో ముక్కలుగా చేస్తారో నీకే తెలుస్తుంది. యీ జనం అప్పటికీ నమ్మకుంటే పోలీస్ రిపోర్ట్ చేస్తాను. అప్పుడు నిన్ను దేవుడు ఆ రాజేశ్వరుడు కూడా రక్షించలేడు."

ఫాతిమా ఆవేశంతో అలా వాగుతుంటే బుచ్చిరెడ్డి బలహీనపు గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయ్. దేహం స్వేదంతో తడుస్తుంది. నాసాపుటాల్లోంచి ఉచ్ఛ్వాస నిశ్వాసాలు వేగంగా వస్తున్నాయి.

లాభంలేదు. దీన్ని విడిచిపెడితే యెంతయినా చేస్తుంది. తెగించిన ఆడదియిది. తనని ఖాయంగా నాశనం చేసి తీరుతుంది యీ ఆడది. అందుకే దాన్ని చంపేయ్యాలి. వెంటనే యిప్పుడే దాన్ని చంపెయ్యాలి.

బుచ్చిరెడ్డి బలమైన రెండుచేతులూ ఫాతిమా లేత మెడని బిగిస్తున్నాయ్.

వాగ్దాటికి అంతులేకుండా యింతసేపూ పేలిన ఫాతిమా యిప్పుడు మాట్లాడలేక పోతుంది—

" యిక్...యీ... క్... క్క్... క్క్" ఫాతిమా మెడచుట్టూ బుచ్చిరెడ్డి కర్కశ హస్తాలతో బిగింపబడటంతో అసలే గుండెజబ్బుగల ఫాతిమా నోటి నుంచి యిక మాట రావటంలేదు. ఆమె గుండెలు టిక్...టిక్ మని కొట్టుకునే ఆమె బలంలేని-జబ్బుగల గుండెలు 'ఠప్'న ఆగిపోయాయ్

చింతచెట్ల గుబురులోంచి మాటలు వినిపించక పోవడంతో తటాల్న లేచి వేగంగా ఆ చీకట్లోకి వెళ్ళాడు శ్రీపతి.

ఆ దృశ్యం అలా చూస్తూ వుండిపోయాడు.

ఫాతిమా చనిపోయింది. చనిపోయిన ఫాతిమ శవం ముక్కు దగ్గర కంగారుగా వేలిపెట్టి చూస్తున్నాడు బుచ్చిరెడ్డి. దీన్ని యేటిలో పారెయ్యాలి. పొద్దుటే వూరు వాళ్ళు దీనిశవాన్ని యేటిలోంచి తీసి వూళ్ళోకి తీసుకొస్తారు. యిది ఆత్మహత్య చేసుకున్నట్లో, లేకుంటే యీ శ్రీపతి

గాడితో తిరిగి వాడు చంపేస్తే చని పోయినట్టో వూళ్ళో రుజువు చెయ్యొచ్చు అనుకుని శవాన్ని రెండు చేతుల్లోకి తీసుకుని ఒక్క అడుగు ముందుకువేసిన బుచ్చిరెడ్డి కళ్ళకి శ్రీపతి కన్పించాడు.

బుచ్చిరెడ్డి గుండెలు టకా టకా కొట్టేసుకుంటున్నాయ్

నరాలు పట్టువిడవటంవల్ల చేతిలో శవం నేలజారేలా వుంది.

శవాన్ని నేలమీద విడిచేసి పారిపోతున్న బుచ్చిరెడ్డి మెడ పట్టుకుని ఆపాడు శ్రీపతి.

"శవాన్నెత్తుకో... నడు వూళ్ళోకి." హుంకుం చేశాడు శ్రీపతి.

"ఏ...మి... ఏమిటి నీ అజమాయిషీ?"

"అది వూళ్ళో చెబుతాను ముందునడు."

బుచ్చిరెడ్డి ఫాతిమా శవాన్ని తీసుకుని నడుస్తున్నాడు ఏటి ఒడ్డున.

ముందు శ్రీపతి వెనక బుచ్చిరెడ్డి.

వెనకనే నడుస్తున్న బుచ్చిరె చేతుల్లో శవాన్ని దబ్బున ఏటి నీళ్ళల్లో పారేశాడు.

టక్కున వెనక్కి తిరిగాడు శ్రీపతి.

అప్పటికే ఏటి నీటి వేగానికి ఫాతిమా శవం కొట్టుకు పోతోంది.

పరుగెట్టబోయిన బుచ్చిరెడ్డిని బలంగా పట్టుకున్నాడు.

"యెందుకు చేశావీ పని?" కర్కశంగా అడిగాడు శ్రీపతి.

"యేపని?" జన్మలో ఎప్పుడూ పడనంత భయంతో అన్నాడు బుచ్చిరెడ్డి.

"యిదే యీ పని.....రేపు వూళ్ళో యేం చెబుతావ్?"

"ఏటికి షికారెళ్ళి పడిపోయిందని చెబుతాను."

"మరి వూరి వాళ్ళకి పోలీసోళ్ళకి నన్నేం చెప్ప మంటావ్?"

శ్రీపతి ప్రశ్నకి యేం చెప్పాలో అర్థంగాక దబ్బున శ్రీపతి కాళ్ళమీద పడ్డాడు బుచ్చిరెడ్డి

"లే... లేరా" టప్పున తన్నాడు శ్రీపతి.

అల్లంత దూరాన బుచ్చిరెడ్డి శ్రీపతి కేసి భయంగా చూస్తున్నాడు. "ఇప్పుడు నిన్నేం చెయ్యను. రేపు కూడా నిన్నేం చెయ్యను. చేసేటప్పుడు చేస్తాను." అని అక్క ణ్నుంచి వేగంగా వెళ్ళిపోయాడు శ్రీపతి.

# 14

తూరుపు ఎర్రబారి తెల్లవారింది.

చలిపొద్దువేళ ఏటిలో పడిపోయిన ఫాతిమా శవాన్ని వూళ్ళోకితెచ్చారు సాతానివాళ్ళు.

పంచాయితీ పెట్టాడు. ఆ వూరి నలుగురు పెద్దలూ ఆత్మహత్య అని తీర్పుయిచ్చారు. అసలు పెద్ద ప్రెసిడెంటు బుచ్చిరెడ్డి "ఔను. ఆత్మహత్యే" అని రుక్కించి చెపుతూ చుట్టూ మూగిన జనంలో వున్న శ్రీపతిని చూసి క్షణం వులిక్కిపడ్డాడు.

• • •

యీ శ్రీపతిగాడు నా పాలిట యమధర్మరాజై కూర్చున్నాడు. నా పక్కలో ఉక్కుబళ్ళెమై కూర్చున్నాడు.

యీ వెధవ నా కొడుకుని యీ వూర్నించి పంపె య్యాలి. లేకుంటే రేపటినుంచి ఆడిదే రాజ్యం. ఆడే అధికారి.

వాడ్ని పంపెయ్యాలి, తరిమెయ్యాలి. కానీ యెలా?

వీడు చేతిలో ఇరుక్కుపోయానేం. వాణ్నిప్పుడు యేం చేసినా సింహంలా మీదికి దూకి వాడి కోరల్తో నన్ను పీక్కు తింటాడు. రక్తం పుక్కిలించి వూస్తాడు.

ఆలోచిస్తున్న బుచ్చిరెడ్డికి ఆ రాత్రి నిద్రపట్టలేదు. పట్టదు. ఆ రాత్రి తనపాలిట కాళరాత్రి.

• • •

యీ జనాన్నేదో చెయ్యాలి. యీ జనంమధ్య యెలా బ్రతకాలో అర్థం గావటంలేదు. మార్పు అనే వాక్కుడు తీసుకురావాలని ప్రయత్నిస్తే వాడు తప్పకుండా కుపితుడై తీరతాడు. వాడలా కావటానికి కారణం ఆ పరిసరాల్లోవుండే వొట్టి పురుగులు. ఆ పురుగుల న్యాయవృత్తులు. ముందు వాటిని నాశనం చెయ్యాలి. అవి నాశనం కావాలి. కానీ యెప్పటికో! కానీ యేది యేమైనా యేది జరిగేలా జరగ నియ్యాలి. కడకి యేదో జరుగుతుందని నిరీక్షించాలి. అప్పుడే యీ జనాన్ని నేనేం చెయ్యాలో వాకుతెలుస్తుంది.

ఆలోచిస్తున్న శ్రీపతికి ఆ రాత్రి నిద్రరాక అలా వుండిపోయాడు.

• • •

"ఏమిటి వారి విషయం అలా సందర్భంలో వదిలేశారు ?" అడిగాడు రామమూర్తి.

"యిప్పుడెలా సాధ్యం. అది చచ్చి నరకానో స్వర్గానో వుంది? వేరే ఆధారంలేదు" అన్నాడు బుచ్చిరెడ్డి.

"ఐతే ఆ విషయం అంతేనా నా మాటమీద నమ్మకం లేదా?" వుక్రోషంగా అన్నాడు రాజేశ్వర్రావు మేస్టారు.

"నువ్వు చూసినది కటిక నిజమే యిక దానివల్ల ప్రయోజనం లేదు. నాక్కూడా కడుపు మండి పోతుంది. ఆ వెధవని యెప్పుడు తరిమేద్దామా అనికూడా వుంది. కసినీ బాధనీ మిళితం చేస్తూఅన్నాడు బుచ్చిరెడ్డి.

# 15

నిన్న మధ్యాహ్నం మొదలయిన వర్షం ఆగకుండా కురుస్తూనే వుంది.

బాగా రాత్రయింది.

ప్రెసిడెంటు బుచ్చిరెడ్డి ఊలు శాలువా కప్పుకుని పొరుగూరి నుంచి ఆ ఊరులోకి అప్పుడే కూతురుతో దిగిన అంకయ్యతో మాట్లాడుతున్నాడు.

అంకయ్య ఎబ్బైయేళ్ళ వయసుంటుంది. వాళ్ళూరులో కాఫీహోటలు పెట్టుకు బ్రతికాడు. ప్రస్తుతం వాళ్ళూరులో మరో పెద్ద హోటలు పెట్టడంవల్ల అంకయ్య చిన్న టీ బడ్డీ వ్యాపారం పడుకుంది. దుర్గంలో కేదారేశ్వరాలయం దగ్గర మళ్ళీ తన కాఫీ బడ్డీ వ్యాపారం మొదలెడ్దామని పూచిన మామిడి కొమ్మలాంటి అందకత్తయిన కూతురుతో వచ్చాడు.

అంకయ్య అతని కూతురు శివాలక్ష్మి బుచ్చిరెడ్డి యింటి ముందు వర్షంలో తడుస్తూనే నిలబడ్డారు.

బుచ్చిరెడ్డి వాళ్ళని పైకి రండయినా అనకుండా వెచ్చటి శాలువాలో ముగుతూ మాట్లాడుతున్నాడు. మాట్లాడుతుండే చూపు శివాలక్ష్మి కేసి విసురుతున్నాడు.

మా ఊరు జనాలకి ప్రొద్దుటే చద్దన్నం తినే అలవాటు తప్ప ఇడ్లీలు తిని టీ తాగే వ్యసనం లేదయ్యా!"

"రోజుకి పాతిక రూపాయలు వ్యాపారం జరిగితే చాలండి. అంత జరుగుద్దని అనుకుంటున్నానండి."

అంకయ్య మాటలు వింటున్నా బుచ్చిరెడ్డి చూపులన్ని వర్షంలో తడుస్తున్న శివాలక్ష్మి మీదే వున్నాయి.

శివాలక్ష్మికి యెంతో వయసుండదు. యిరవైలోపు. దేహం రంగు చామన చాయ. కొత్త వెవకబడ్డ జాతేమో

శరీరం యింకా నల్లగా కన్పిస్తుంది చూపేవాడికి.

నుదుటికి ఆరిపోయిన సూర్యుడు లాంటి పెద్దకుం కుమ బొట్టు. ముక్కుకి యిప్పుడే వెలిగిన చెంద్రుడి రంగు బ్రేసరి. చెవులకినక్షత్రాల్లాంటి కమలాలు. దేహానికి అంటుకు పోయిన జాకెట్టూ- ముతక లంగా ముతక కాని వోణీ కాళ్ళకి పట్టాలూ... యిదీ శివాలక్ష్మికి దేవుడు ఒద్దిన రూపు.

శివాలక్ష్మిని చూస్తూ "సర్లే పెట్టుకో" అనేశాడు అంకయ్యతో.

ధర్మప్రెభులు అనేసి పొగిడేసి ఆ వర్షంలో కూతురుతో సైతం వెళ్ళి పోబోతున్న అంకయ్యని "ఆగాగు—యీ వర్షంలో యీ వూళ్ళో యెక్కడికెళ్తావ్... యీ రాత్రికి మా అరుగుమీద తలదాచుకోండి" అన్నాడు ధర్మప్రెభువు బుచ్చిరెడ్డి.

గదిలోపల వెచ్చగా మంచం మీద శాలువాలో మగ్గు తున్నాడు బుచ్చిరెడ్డి.

గది బయట వర్షానికి తడుస్తున్న అరుగుఅంతా తడుస్తూ చలికి వొణుకుతూ జాగరణ చేస్తున్నారు అంకయ్యా అతని కూతురు శివాలక్ష్మి.

బుచ్చిరెడ్డికి నిద్రరావడంలేదు అరుగుమీద ఆ పిల్లని తనగదిలోకి తెచ్చుకుందామని వుంది.

అంకయ్యకీ శివాలక్ష్మికి కూడా నిద్ర రావడం లేదు. యీ మాయదారి వర్షం తొరగా తగ్గిపోతే సుబ్రంగా కాసింత కునుకు తియ్యొచ్చు అని వుంది.

వర్షం కురుస్తూనే తెల్లవారి కూడా కురుస్తూనే తెల్ల వారింది, తెల్లవారి కూడా కురుస్తూనేవుంది.

అంకయ్య టీ కొట్టుగుడి ముందు కుదుమట్టంగా వెలి సింది.

రోజులు గడుస్తున్న కొద్దీ గుడికి వొచ్చే భక్తుల

కన్నా అంకయ్య టీ బడ్డీకొచ్చే పాసింజర్లే అధికం అయ్యారు. అంకయ్య కూతురు సర్వ్ చేస్తుంటే కళ్ళింత చేసుకుని చూస్తున్నారు జనం.

ప్రెసిడెంటూ ఆతని మిత్రత్రయం సాయంత్రపు బిశాణా అరుగు మీదనుంచి అంకయ్య హోటల్లోకి మార్చారు. ఆ కారణంగా అంకయ్య టీ కొట్టు రాత్రి పది గంటల దాకా వుంటుంది.

యెప్పుడూ బైట నీటి బొట్టు నాలుక్కూ రాచుకొనే ప్రెసిడెంటు బుచ్చిరెడ్డి యిప్పుడు అంకయ్య హోటల్లో శివాలక్ష్మి చేసిన బెల్లం టీ పావు అర్ధగంటకి వొకసారి చప్పరించడం మొదలెట్టాడు. శివాలక్ష్మి చేత నిప్పు తెప్పించుకుని చుట్టముట్టిస్తూ ఆ పిల్ల నల్ల కళ్ళలో యేదో దొరికినట్టు చూస్తుంటాడు.

ఆ పిల్ల కళ్ళు గాలికి ఆడే లేత ఆకుల్లా కొట్టు కుంటాయ్.

అంకయ్యకి ప్రెసిడెంటు బాబు తమ కొట్టుకి రావడం మహా భాగ్యంగా వుంటుంది. పరమ ఆనందపడి పోతాడు ఆ ముసలివాడు.

ఆ రోజు గుడిలో దక్షిణలు బాగా రావడంతో హుంషారుగా బయలుదేరాడు శ్రీపతి.

వో చార్మినార్ పెట్టికొన్నాడు. సారా కొట్లో కెళ్ళి కడుపునిండా తాగేసి చిల్లర, కొట్టువాడి గళ్ళా పెట్టెలోకి చిమ్మేలా కొట్టాడు.

పదిగంటల ప్రాంతంలో అంకయ్య టీ కొట్లోకి తూలుతూ వొచ్చిపడ్డాడు.

యింకా అక్కడేవున్న బుచ్చిరెడ్డి అతని మిత్రులూ పూజారి రాకకి తుళ్ళిపడ్డారు.

ప్రెసిడెంటు కళ్ళల్లోకి మత్తుగా చూశాడు శ్రీపతి.

క్షణం బెదిరింది ప్రెసిడెంటు బుచ్చిరెడ్డి దేహం.

శివాలక్ష్మి వొచ్చింది "ఏం కావాలి పూజారిబాబూ?" అవడిగింది.

శివాలక్ష్మి కళ్ళలోకి చూశాడు శ్రీపతి. తాత్వికంగా నవ్వాడు శ్రీపతి.

"ఏదైనా కావాలి. కానీ యేదీదొరకదు. దాహానికంతు వుండదు."

"ఏం కావాలి బాబూ?"

"ఏముందనిస్తావు?"

"కొట్టుకట్టేటప్పటైమైందిగా టీయే వుందిబాబూ!"

"అంతేగా! పట్రా...పట్రా"

బుచ్చిరెడ్డి మిత్రులికి యీ పూజారిగాడి ప్రవర్తనకి చెర్రెత్తింది. నిప్పుతొక్కిన కోతుల్లా వాళ్లు లేవబోతుంటే బుచ్చిరెడ్డి వాళ్ళని కుదేసున్నాడు.

శివాలక్ష్మి టీ తెచ్చేలోపు భళ్ళున కక్కేశాడుశ్రీపతి.

వాసన ఆ హోటలు పాకంతా ప్రసారం ఔతుంది, పాడువాసన.

ఆ పాడు వాసనని భరించలేక అక్కణ్ణుంచి వెళ్ళిపోయారు బుచ్చిరెడ్డి అతని మిత్రులు.

పూజారి శ్రీపతి కక్కినందుకు శివాలక్ష్మి విసుక్కోలేదు. నొచ్చుకోలేదు. రోజూ యీ పూజారి బాబుని గుళ్లో చూస్తూనే వుంటుంది శివాలక్ష్మి. యీ బాబు చాలామంచోడు. యీ హోటలు పాకకి టీ కొచ్చిన చాలామంది కుర్రాళ్ళు తుంటరిగా ప్రవర్తిస్తారు ప్రెసిడెంటుబుచ్చిరెడ్డిలా చూస్తుంటారు, కానీ యీ బాబలా చూడడు.

యీ బాబుని శివాలక్ష్మి ప్రేమిస్తుందా? వుహూఁలేదు. యీ బాబు యీ ప్రపంచంలో యే ఆడదాన్నీ ప్రేమించదని ఆ బాబు ప్రవర్తన ద్వారా ఋజువు అవుతూనేవుంది.

శివాలక్ష్మి మజ్జిగ తెచ్చి పూజారి బాబుకి పట్టించింది.

"శివాలక్ష్మి।''

"యేంబాబు?"

"నువ్వు చాల మంచిదానివి." అని లేచి వెళ్ళిపోయడు శ్రీపతి.

"యెంత బరితెగించాం వెధవ ...రేపే పదిమందిలోనూ పెడ్దాం పెడపని పుక్రోషంగా అన్నాడు కరణం రామ్మూర్తి.

తక్కినవాళ్ళు ఎవరికి తోచింది వాళ్ళు వాగుతున్నారు.

బుచ్చిరెడ్డి యేమిమాట్లాడ్డంలేదు.

బుచ్చిరెడ్డి నిర్ణయం కోసం చూస్తూ అది యెంతకీ రాక ఆపూటకి విడిపోయారు మిత్రులు.

బుచ్చి రెడ్డి ఇంటి దారి పట్టాడు.

యీ వెధవ తను కోరుకున్న ఆపిల్లని యేదో చేసేలా వున్నాడు. ఆ పిల్లని రేపే యేదో తెచ్చుకొని చెప్పమన్నది. అది చెప్పింది చెప్పక పోవడం యెవడికొ్కావాలి... అది తన సొత్తు యెప్పుడైతే దాని బాబుకి యీ ఆలయం ముందు హోటలు పెట్టుకోవడానికి ఆమోదం తెల్పాడో అప్పుడే అది తన సొత్తయింది.

* * *

"రండి బాబు రండి" ప్రెసిడెంటు బుచ్చిరెడ్డి రావడంతో బల్ల తుండు గుడ్డతో తుడిచి ఆహ్వానించాడు అంకయ్య.

"అంకయ్యా వచ్చేటప్పుడు చుట్టలు మర్చిపోయొచ్చాను యింటికెళ్ళి మా దాలమ్మనడిగి చుట్టల డబ్బా అడిగి పట్టుకొద్దు?" అని బల్లమీద కూర్చుని లోనికిచూశాడు బుచ్చిరెడ్డి

"చిత్తం" అని వెళ్ళిపోయడు అంకయ్య.

అంకయ్య వెళ్ళాక "శివాలక్ష్మి" అని ప్రేమగా పిల్చాడు బుచ్చిరెడ్డి లోపల ఇడ్లీపప్పు రుబ్బుతున్న శివాలక్ష్మి చెయ్యి కడుక్కొచ్చి యేటిబాబు యేం కావాలి ? అనడిగింది.

"ముందు అర్జంటుగా వోటి పత్రా అన్నాడు ధీమాగా టీ తెచ్చింది శివాలక్ష్మి."

"సరె రాత్రి విన్న ఆ శ్రీపతి గాడు యేదన్న చేశాడా?" అడిగాడు

"లేదు" బాబు."

"వాడెమన్నా చేస్తే చెప్పు తొక్క వోలిచేస్తాను వెధవని వాడు యెవర్ని యేమన్నా వూరుకుంటాను గాని విన్నంటే మాత్రం ఊరుకోలేను. ఆ(" అని శివాలక్ష్మి కళ్ళల్లోకి చూశాడు బుచ్చిరెడ్డి.

"ఆ బాబు నన్నెప్పుడూ యేమీ చెయ్యడు బాబూ?" స్పష్టంగా అంది శివాలక్ష్మి. ఆమాటలో బుచ్చిరెడ్డికి యేదో శకునం కన్పించింది, కొంపతీసి యిది అప్పుడే వాడి వలలో పడిపోలేదుగదా !

"అది సరే...రేపు చింతల తోటకాడి కొస్తావా?"

"దేనికి బాబూ?"

"అక్కడ చెప్తాను. నీ కోసంమల్లిపూలు కూడా తెస్తావు రేపురా"

శివాలక్ష్మికి అర్ధమైంది "రానుబాబూ !'' అంది ఖచ్చితంగా.

"పోనీ మా యింటికి రా వూరు మాటు మణిగాకా''

అసలు రానుబాబూ" అంది చాలా ధైర్యంగా.

శివాలక్ష్మి మాటలకి బుచ్చిరెడ్డి వొళ్లు చలించింది. ఆడదానికి ఎంత ధైర్యం!

"రావూ ?"

"రాను"

"రాకుంటే చాలా గొడవవుద్ది... రేపురాత్రి బాగా పొద్దోయాకా నీకోసం చూస్తుంటాను మా యింటి దగ్గర" అవి జవాబు ఆశించకుండా వెళ్ళిపోయాడు బుచ్చిరెడ్డి.

బుచ్చిరెడ్డి వెళుతూ అన్నమాటలకి శివాలక్ష్మి చాలా బెదిరిపోయింది. బాగా రాత్రయాక శ్రీపతి కూర్చునే ఏటి వడ్డుకి పరుగెత్తింది.

* * *

వెన్నెల—

సిగరెట్లు కాలుస్తు ఏటి నీటిని చూస్తున్న శ్రీపతికి కాస్తదూరంలో "బాబూ!" అన్న కఠం వినిపించింది.

"యెవరూ?"

"నేను బాబూ శివాలక్ష్మిని"

"నువ్వా రా రా"

వచ్చింది శివాలక్ష్మి

"ఏమిటీ యీవేళప్పుడొచ్చావు?"

"మీతో చాలా పనుంది బాబూ!"

"చెప్పు"

"ఆ ప్రెసిడెంటు బుచ్చిరెడ్డి బాబు నన్ను తనఇంటికి రమ్మంటున్నాడు బాబు. నాకు ఇష్టంలేదు బాబూ. రేపు రాకుంటే చాలా గొడవ అవుతుంది అని వెళ్ళిపోయాడు బాబూ!"

శివాలక్ష్మి చెప్పిన మాటలన్నీ వింటూ పూర్తిగా కాలిన సిగరెట్ యేటిలోకి విసిరి మరో సిగరెట్ తీసి అంటించి ఆలోచనలోపడ్డాడు శ్రీపతి.

చాలా సేపటికి అతనికో ఆలోచన వొచ్చింది,

"సరే శివాలక్ష్మి నువ్వెళ్ళు... యీ సారి మళ్ళీ రమ్మంటే రాను అని ఖచ్చితంగా అను·" అని చెప్పి పంపేశాడు.

వయసులో వుండగానే భార్య చనిపోయిన బుచ్చిరెడ్డి చాలామంది ఆడాళ్ళని పాడుచేశాడు. పాడయిన వాళ్ళలో కొందరు తనకి తెల్సు.

యే విషయమో చాలాసేపు ఆలోచిస్తూవుండి పోయాడు శ్రీపతి.

• • •

"యెంత పొగరే నీకు! నేను రమ్మంటే యెంతటి మహారాణీ ఐనా నే పిలిస్తే రావాల్సిందే నాకు తలొగ్గాల్సిందే. అలాంటిది నువ్వా! నీబోడి అందం యెంతటిదే నాముందు?"

బుచ్చిరెడ్డి మాటలకి నిజంగా గజగజా వొణికి పోయింది శివాలక్ష్మి.

"వూఁ ....యీ రాత్రికి నీ కోసం కాసుకు కూచుంటాను" అని వెళ్ళి పోయాడు బుచ్చిరెడ్డి.

• • •

తను చెప్పిన ప్రకారం శివాలక్ష్మి రాలేదు.

బుచ్చిరెడ్డి గుండెల్లో అగ్ని సర్పం భుస్సుమంది. ఆ అగ్ని కళ్ళల్లోంచి కూడా ప్రసారం ఔతూంది.

లాభం లేదు వెంటనే బయల్దేరాలి. వాళ్ళ టీ బడ్డీలో అది ఆదమర్చి నిద్ర పోతూంటుంది. నోటిలో కండువా కుక్కేసి గుట్టుగా దీన్ని చింతల తోటలోకి తీసుకెళ్ళిపోవాలి యెండిన చింతాకుల నేలమీద, ఆ చీకట్లో దీన్ని కసిగా పొర్లించాలి. అనుకుని కసిగా లేచాడు బుచ్చిరెడ్డి.

ఆ రాత్రి నిశ్శబ్దంగా వున్న వూరి వీధిలో నడుస్తున్నాడు బుచ్చిరెడ్డి. రాజేశ్వరాలయం పక్క టీ బడీ వేపు అడుగులు వేస్తూ ముందుకి చూశాడు బుచ్చిరెడ్డి—

శ్రీపతి బుచ్చిరెడ్డికి యెదురొచ్చాడు.

"యెందాకానండీ ప్రెసిడెంటుగారూ?" కుశల ప్రశ్న వేసినట్టు అడిగాడు శ్రీపతి.

"అలా... అలా యేటి వొడ్డుకి." నసుగుతూ అన్నాడు బుచ్చిరెడ్డి.

"పద నేనూ వస్తాను సర్దాగా!" అని బుచ్చిరెడ్డితో

ముందుకి నడిచాడు శ్రీపతి.

'' వీడి పెంటేమిటి మధ్య. విసుక్కున్నాడు బుచ్చి రెడ్డి. వీడిపీడ యీవూరి నుంచి తొరగా విరగడైతే బాగుండును అనుకున్నాడు బుచ్చిరెడ్డి.

యిద్దరూ వూరి చివరి ఏటిఒడ్డుదాకా వచ్చారు.

"యిలా కూర్చుందాం'' అన్నాడు శ్రీపతి.

బుచ్చిరెడ్డికి కూర్చోక తప్పలేదు.

"ఔను బుచ్చిరెడ్డీ! నీ జ్ఞాపకాల రథాన్ని వొక యిరవైయ్యేళ్ళ వెనక్కి పరుగెత్తించు'' అన్నాడు శ్రీపతి.

"యింత పొద్దుపోయెందుకూ?" అడిగాడు బుచ్చిరెడ్డి

"చెప్తాను"

"లేదు నాకు పనుంది వెళ్ళాలి"

"సరే యీకాస్త వినేసిపో" అనేసి ఆ కాస్త చెప్ప డం మొదలెట్టాడు శ్రీపతి.

"బుచ్చిరెడ్డీ!...యిరవైయ్యేళ్ళ క్రితం నీకు మదన పల్లిలో సురభీ కంపెనీవాళ్ళు తారాశశాంకం నాటకం వేశారు గుర్తుందా?" శ్రీపతి అడిగాడు.

వీడెవెవడబ్బా! యిరవైయ్యేళ్ళ క్రితం నా జీవితాను భవాన్ని గురించి అడుగుతాడు? ఐనా యిరవైయ్యేళ్ళక్రితం సంగతులు వీడికెలాతెల్సు ?

"ఆ తారాశశాంకం నాటకం వేసిన ట్రూపులో జలంధర అనే ఆమె నీకు బాగాతెల్సుకదూ? ఆ జలంధరవి ఆ నాటకం ట్రూపులో వేషాలు వెయ్యకుండా వాళ్ళ నుంచి విడదీసి మదనపల్లిలో ఆమెకి అద్దెఇల్లుచూపి అందులో పెట్టి పోషించావు కదూ?"

వొక్కసారి బుచ్చిరెడ్డి గుండెల్లో గూడ్సు రైళ్ళు పరుగెత్తాయ్.

"ఇ...ఇదంతా...ఇదంతా నీకెలా తెల్సు శ్రీపతీ ?"

"యింకా చాలా తెల్సు అగు ......అ జలంధర వొక కూతుర్ని కన్నాక ఆమె ఆరోగ్యం చెడిందని ఆమె అందం పోయిందని ఆమెని మోసంచేసి పారిపోయావు కదూ ?...కదూ ??"

బుచ్చిరెడ్డి ముఖమంతా చెమట ధారలుగా కారుతుంది.

"యిది...యిది నీ... నీకెలా తెల్సు శ్రీపతీ?''నీకు

"యింకా చాలా తెల్సు... అగు ఆ తర్వాత జలంధర ఏమయిందో తెలియదు ఔను కదూ?"

"ఔ ..ను"

"సరే... ఆ తర్వాత కథ యిప్పుడు నేను చెపుతాను ఆ జలంధర విన్న మొన్నటి వరకూ బ్రతికేవుంది. ఆమె కూతురిని ఆ నాటకం ట్రూపులో డోలక్ వాయించేవాడికిచ్చి తను చచ్చిపోయిందది"

"ఏమిటీ?"

"ఔనూ... ఆ డోలక్ వాయించిన వాడే టీ బడ్డి అంకయ్య. ఆ శివాలక్ష్మి నీ కూతురే."

అంతే... వొక్కసారిగా బుచ్చిరెడ్డి గుండెల్లో గాజు మేడ భళ్ళున కూలిపోయింది, బుచ్చిరెడ్డి మూడుసార్లు వొంకరగా తిరిగిపోయాడు.

"ని... నిజవా ?"

కావాలంటే ఆరాలు తియ్యి... యిక మాట్లాడకు అర్జంటు పనుందన్నావ్‌గా వెళ్ళి చూసుకో...పో."

బుచ్చిరెడ్డి దేహం భూమ్మీదున్న పాతాళంలోకి దిగబడి పోతున్నట్టుంది. ఔనూ ఇదంతా యీ శ్రీపతిగాడు ఎక్కడ సేకరించాడు? వాడు దేవాంతకుడు. వాడ్నిలా యీ వూరిలో వుంచితే కొద్దిరోజుల్లో యీ వూర్ని కబళించేస్తాడు. కాబట్టి వెంటనే వాడ్ని యీవూర్నించి తరిమెయ్యాలి.

• • •

"మా మేనల్లుడు గంగాధరం ఎల్లుండి వస్తున్నట్టు రాశాడు." రాజేశ్వర్రావు మేస్టారితో అన్నాడు బుచ్చిరెడ్డి.

"అలాగా! పోన్లే ... తొరగా పెళ్ళి చేసెయ్యండి యీ యింట్లో కాస్త సందడిగా వుంటుంది."

"ఏం సందడయ్యా బాబూ! యీ శకినం గాడ్ని ముందు వూళ్ళోంచి తరిమేస్తే నా మనసులో కావాల్సినంత సందడి."

"సమయం వస్తుంది కంగారొద్దు."

"యీలోపు వాడు మనల్ని కటిశించేస్తాడని భయంగా వుంది."

"నాకూ కుడా."

"ఔనూ... యీ గుడికి గంట కాస్త పెద్దది పెట్టించాలని మనం యేనాటినుంచో అనుకుంటున్నాం. కాబట్టి త్వరలోనే ఈ చుట్టుప్రక్కల వూళ్ళన్నీ పెద్దగా ప్రచారం చేయిద్దాం. యీగుడికి పెద్ద గంట పెట్టిస్తున్నాం కాబ చందాలివ్వండని. చందాలు పోగడ్డాక ఆ కంచుగంట ఆరవల్లి స్వాములవార్ని పిలిపించి వారిచేత కట్టించి మ్రోగింపజేద్దాం. ఆస్వాములవారికే మన గుడి పూజారి చెడుప్రవర్తన గురించి విన్నవించుదాం. ఆ స్వాములవారే వీడిని బహిష్కరించి వెంటనే మరో పూజారిని విర్ణయిస్తారు, యెలావుంది యీ ఆలోచన?" అన్నాడు కరణం రామ్మూర్తి పంతులు.

రామ్మూర్తి ఆలోచనకి అంతా ఎగిరి గంతేసినంత ఆనంద పడ్డారు.

"సరే" అంటే 'సరే' అనుకున్నారు అంతా.

బాగా చీకటి పడింది.

రెండు ఫర్లాంగుల దూరంలో, కురపల కోటబస్సులో అప్పుడే దిగిన గంగాధరం ఎయిర్ ఇండియాబాగ్ భుజాన్ని

తగిలించుకుని, సూట్ కేసు చేత్తోపట్టుకుని వూళ్ళోకి వస్తు న్నాడు.

ఏటిగట్టు దగ్గర కూర్చుని సిగరెట్లు కాలుస్తున్న శ్రీపతినిచూశాడు గంగాధరం. శ్రీపతి నెరగడు గంగాధరం. అతనికి దగ్గరగా వెళ్ళి" అగ్గిపెట్టిస్తారా?" అన్నాడు.

జేబులోంచి "అగ్గిపెట్టె" తీసిచ్చాడు శ్రీపతి.

గంగాధరం సూట్ కేసూ- ఎయిర్ ఇండియాబాగూ ఏటి ఒడ్డు పచ్చికపైన కుదేసి కూర్చుని సిగరెట్ అంటించు కుని "నా పేరు గంగాధరం అంటారు. నేను యీ వూరి ప్రెసిడెంటు బుచ్చిరెడ్డికి మేనల్లుణ్ని." అన్నాడు.

ఆ మాటలని గిరుక్కున ఇటు తిరిగిన శ్రీపతి "అలాగా! నాపేరు శ్రీపతి... నా గురించి నేను చెప్పుకోవ డం అనవసరం... వూళ్ళోకి వెళుతున్నారుగా మీకే తెలు స్తుంది." అన్నాడు.

శ్రీపతి మాటలకి గంగాధరం క్షణం నవ్వి, "జనం నోరు భూగోళం కంటే పెద్దది. వాళ్ళేదో వాగుతారు. మీ గురించి మీరేచెప్పండి. అదే నేను నమ్ముతాను." అన్నాడు.

గంగాధరం బుచ్చిరెడ్డిలాంటివాడు కాదనీ అభ్యు దయ భావాలు కలవాడే అనిపావుగంట సంభాషణలో ధృవ పడింది శ్రీపతికి.

"మీ మామయ్య ఆస్తికి మీరే కదూ వారసులు?" అడిగాడు శ్రీపతి.

"ఔను."

"మీ ఆస్తికి తగ్గ అమ్మాయిని మీరు పెళ్ళి చేసుకుం టారు గదూ ?

"అలా యెలా అనుకుంటున్నారు ?

"యెలా అనుకోవాలో చెప్పండి."

"చెప్పేదేమీ లేదు...కాని నాదంటూ కొన్ని స్వతంత్ర

భావాలున్నాయి నాకు. అన్నట్టు మీరు తెలుగు పత్రికలు రెగ్యులర్‌గా ఫాలో ఔతుంటారా?" అడిగాడు గంగాధరం.

"లేదు ... తెలుగుకథా ... తెలుగు సిన్మా చూసి చాన్నాళ్ళయింది. జవాబిచ్చాడు శ్రీపతి.

"నేను వో చిన్న సైజు రచయితని. రేపు నా కథలు పడ్డ పత్రికలు మీ కిస్తాను చదవండి. యీ వ్యవస్థ మీదా మగ్గిపోయే జనం మీదా నాకు విపరీతమైన కోపం. కులాంతర వివాహాల్ని నేను ప్రోత్సహిస్తాను- "ఫ్రీలా సొసైటీ" అని ఆ మధ్య వొక కథ రాశాను.

గంగాధరం మాటల్ని వింటుంటే శ్రీపతికి కాస్త ఉత్సాహం కలుగుతోంది. వూపిరి సుఖంగా విడుస్తున్నాడు.

"రేపు మీరు నన్ను కలుస్తారా?" అని అడిగాడు. శ్రీపతి.

"తప్పకుండా ... యిక్కడ కలుద్దాం ... సరే ఇప్పుడు నా పెట్లోంచి నా కథలు పడ్డ పత్రికలు తీసిస్తాను. యీ నైట్‌కి చదవండి. రేపు మనం మాట్లాడుకోవడానికి మంచి మేటర్ దొరుకుతుంది. నా సిద్ధాంతాలు కూడా అర్థమవుతాయ్." అనేసి సూట్‌కేసు తీసి వోపది పత్రికల కట్ట తీసి శ్రీపతి కిస్తూ "మీరు చదివాక నాకు రిటన్ చెయ్యాలి. యివి స్పెసిమన్ కాపీస్" అన్నాడు గంగాధరం.

"అలాగే... అలాగే."

కాస్సేపు మాట్లాడి వెళ్ళిపోయాడు గంగాధరం.

శ్రీపతి మౌనంగా ఆలోచిస్తూ వుండిపోయాడు.

• • •

"శివాలక్ష్మి!"

"యేం బాబూ?"

"బుచ్చిరెడ్డి మళ్ళా నీ దగ్గర కొచ్చాడా?"

"రాలేదు బాబు. సాయంత్రం వేళప్పుడు మా టీ

క్కొట్టుకి కూడా రావడం లేదు బాబూ!"

"మంచిది... సరే... బుచ్చిరెడ్డి యిక నీదగ్గరకి రాడు. వచ్చి నిన్నడిగితే నే చెప్పిన మాటలే జవాబుగా చెప్పు. మీ అయ్యకి కూడా చెప్పు."

"అలాగే బాబూ!... సరే కానీ బాబూ!... జలంధర ఎవరు బాబూ?"

"బుచ్చిరెడ్డికి వుంపుడుగత్తె. నేను మదనపల్లిలో చదివే రోజుల్లో నాకు పరిచయం."

"మీకూ చాలా తెల్సు బాబూ!"

"హుఁ..... మనిషికి యీ ప్రపంచంలో యేదీ తెలియకుండా వుండటమే మెరుగేమో? తెలిస్తే చాలా ఇరుగ్గా వుంటుంది శివాలక్ష్మి!

...... సరే నేవెళ్తాను పనుంది.

• • •

గంగాధరం రాసిన కథలన్నీ చదివిన శ్రీపతికి అతనిమీద చాలా గౌరవ మర్యాద లేర్పడ్డాయ్.

యేటి గట్టున రోజూ గంగాధరం శ్రీపతి కల్సుకుంటున్నారు. చాలా చాలా మాట్లాడుకుంటున్నారు.

ఆ రోజు రాత్రి శ్రీపతి గంగాధరంతో వో ముఖ్యమైన విషయార్థం చర్చిద్దామని అతని కోసం చూస్తున్నాడు.

కాస్సేపటికి గంగాధరం వొచ్చాడు.

ఇద్దరూ సిగరెట్లు వెలిగించారు.

"యిక చెప్పండి...ఏమిటా ముఖ్యమైన విషయం" అన్నాడు గంగాధరం.

"మీ "అహల్యమోక్షం" కథ మీకు గుర్తుందికదూ" శ్రీపతి అడిగాడు.

గంగాధరం నవ్వేసి "నా కథ నాకెందుకు గుర్తుండదూ?" అన్నాడు.

"సరే...మీరు యివ్వాళ దేశంలో రాయడం కోసం—పేరుకోసం డబ్బుల కోసం రాసే రచయిత కాదని నేను అనుకుంటున్నాను. మీ కథలో గుడ్డిదైన అహల్యని వో జమీందారీ యువకుడు పెళ్ళి చేసుకుంటాడు."

"ఔను...అహల్యలాంటి హతభాగ్యురాలు ఆస్థితిలో వుంటే యెవరైనా సరే ఆదుకోవాల్సిందే. నేను సైతం—మీరు సైతం" అన్నాడు గంగాధరం.

"నైస్...యీ వూళ్లో అహల్యలా తుపాను గాలికి వూగిపోతున్నా వో పువ్వువుంది...ఆమెని మీరు పెళ్ళి చేసుకుంటారా?" శ్రీపతడిగాడు.

"యెవరామె ?"

"వివరాలు తర్వాత చెప్తాను" ఆమె చాలా అంద గత్తె... ఆడది చిక్కుల్లో పడ్తుందంటే ఆమె అందమే కారణం అంటున్నట్టు యీమెకూ్కడా అదే... అదే కారణం"

"సరే...వెంటనే ఆమెని నాకుపరిచయంచెయ్యండి"

"అలాకా్కదు...వెంటనే పెళ్ళి జరిగిపోవాలి"

"ఏమిటీ ?"

"ఔను...ఆమెని పెళ్ళాడేముందు మీకు నామాటల మీద చాలా కాన్ఫిడెన్స్ కావాలి. అది వుంటే నే చెప్పి నట్టు చెయ్యండి లేకుంటే మీ కథలు మీరు రాసుకోండి"

శ్రీపతి మాటల్ని వింటూ ఆలోచిస్తూ వుండి పోయాడు గంగాధరం.

"నేను ఏమాటా ఏపనీ యెన్నోరోజులు ఆలోచిస్తేనే అమలులో పెట్టను. ఈ మధ్య తరచూ, నా ఆశయాలు మీరు వల్లిస్తుంటే నాకు చాలా ఆనందం వుత్సాహం కలి గాయ్. రెండు రోజులుగా ఆలోచించాను. యీ సాయం త్రమే యీ నిర్ణయానికొచ్చాను. మీరు చెప్పిన క్వాలిటీస్

అన్నీ ఆమెలో వున్నాయ్. ఆమె మిమ్మల్ని జీవితాంతం అర్థం చేసుకు బ్రతుకుతుంది. ఆమెకి మీరు స్వేచ్ఛ యివ్వచ్చు. తీసుకోవచ్చు. మీరిద్దరూ తృప్తులుగా చాలా హాయిగా బ్రతికెయ్యవచ్చు. ఆ హామీ నేను యిస్తాను నా మీద నమ్మకం వుంటే నాతో రండి...వెంటనే మీకు పెళ్ళి చేస్తాను"

శ్రీపతి మాటల్ని విని తటాల్న లేచాడు గంగాధరం.

"నడవండి" అన్నాడు గంగాధరం.

"యెక్కడికి?"

"మీరు చెప్పిన చోటికి"

"మీరు ఆలోచించండి"

"మిమ్మల్ని నమ్ముకున్నాను. మీ ఆలోచనలే నా ఆశయాలు నడవండి"

"అలాక్కాదు ముందుమీరు..."

"అక్కర్లేదు...నడవండి...యింతగా మీరు ప్రేరేపిస్తున్నారంటే ఆ వెనక యేదోవుందని గమనిస్తున్నాను. మిమ్మల్ని పూర్తిగా నమ్ముతున్నాను."

"సరే" అనిలేచి గంగాధరం భుజంమీద చెయ్యి వేశాడు.

యిద్దరూ సిగరెట్లు కాలుస్తూ కొంతదూరం నడిచాక-

"మిష్టర్ గంగాధరం!...మీరు యిక్కడ వెయిట్ చెయ్యండి పావు గంటలో స్నానంచేసి పంచకట్టుకుని గుడి తాళాలు తీసుకుని వస్తాను" అని గంగాధరాన్ని ఆ తూము కాలువ దగ్గర కూర్చోబెట్టి యింటివేపెళ్ళాడు శ్రీపతి.

అర్ధ గంటలో యిద్దరూ గుడికొచ్చారు.

గుడి మండపంమీద గంగాధరాన్ని కూర్చోబెట్టి అంకయ్య టీ బడీవేపు నడిచాడు శ్రీపతి.

"శివాలక్ష్మీ!...శివాలక్ష్మీ!!"

"యెవరూ?"

"నేనూ"

"మీరాబాబూ?...యేమిటీవేళప్పుడొచ్చారు?"

"చెప్తాను ముందుకొస్త ముఖం కడుక్కుని బట్టలు మార్చుకుని గుడిదగ్గరకిరా" అన్నాడు శ్రీపతి.

యెందుకు బాబూ? అని అడగలేదు శివాలక్ష్మి యీ వేళప్పుడేమిటీ యిలా పిలుస్తున్నాడు? అనుకోలేదు శివాలక్ష్మి దూరంగా గురకపెట్టి నిద్రపోతున్న వాళ్ళనాన్నని నిద్ర కూడా లేపకుండా ముఖం కడుక్కుని తెల్లచీర కట్టుకుని గుడిలో కొచ్చింది శివాలక్ష్మి

అప్పటికే పూజారి దుస్తుల్లో వున్న శ్రీపతి పెళ్ళికి కావల్సిన సరంజామా అంతా సర్దుతున్నాడు.

లుంగితో వున్న గంగాధరాన్ని పూజారి బాబు సరదాల్ని చూసిన శివాలక్ష్మికి ఏమీ అర్ధం కాలేదు. కానీ ఏదో అర్ధంఐంది లీలగా.

కాస్సేపయ్యాక శివాలక్ష్మికి గంగాధరం చేత మంగళ సూత్రం కట్టించి మంత్రాలు చదివాడు మెల్లగా.

పెళ్ళయిపోయింది.

కొత్త దంపతులిద్దర్ని తీసుకుని బుచ్చిరెడ్డి యింటి వేపు తీసుకొచ్చాడు శ్రీపతి.

క్రింది మెట్లమీద కొత్త దంపతులున్నారు.

గుమ్మం మెట్లెక్కి తలుపు కొట్టాడు శ్రీపతి.

"యెవరూ?" లోపల్నుంచి బదకంగా బుచ్చిరెడ్డి.

కాస్సేపటికి బుచ్చిరెడ్డి ఇంటితలుపులు తెరుచుకున్నాయ్. బుచ్చిరెడ్డి చేతిలో వున్న హరికెన్ లాంతరు కాంతి ప్రసారం ద్వారా పూజారి దుస్తుల్లో వున్న శ్రీపతి నవ్వుతూ కన్పించాడు.

"ఏమిటీవేళప్పుడొచ్చావ్?" విసుగ్గా అన్నాడు బుచ్చిరెడ్డి

"అవసరం బాధ్యతా అలాంటివి... తప్పుతుందా?" అని "రా గంగాధరం రాఅమ్మా నాన్నగారికి నమస్కరించు" అన్నాడు శ్రీపతి.

కొత్త దంపతుల్ని చూసిన బుచ్చిరెడ్డి చేతిలో లాంతరు జారిపోవల్సిందే. ఆ లాంతరు లాగే తన గుండె కూడా జారిపోవాల్సిందే కానీ రెండూ జరగలేదు. కానీ జరిగినట్టు కన్పిస్తుంది బుచ్చిరెడ్డి ముఖంలో.

కొత్త దంపతులు బుచ్చిరెడ్డిపాదాలకి నమస్కరిస్తుంటే "ఏమిటీ?" అన్నట్టు చూశాడు. వూపిరాడటం లేదు. నోటమాట పెగలటం లేదు.

"యీ గుడికి పూజారి నయ్యాక నేను చేసిన మొట్ట మొదటి పెళ్ళి" అని బుచ్చిరెడ్డికేసి చూసి నవ్వాడు శ్రీపతి.

◆ ◆ ◆

శ్రీపతి వాళ్ళిద్దరికీ పెళ్ళి చేసినట్టుగాకుండా ప్రెసిడెంటు బుచ్చిరెడ్డిగారే టీ బడ్డీ లేబరు వాడి కూతురుకి యిచ్చి ధనమున్న తన మేనల్లుడిచ్చి ఆదర్శ వివాహం చేశారని వూరంతా పొక్కింది.

బుచ్చిరెడ్డి దొంగకి తేలుకుట్టినట్టు వూరుకున్నాడు. జనం పొగడుతూ గొప్పగా శ్లాఘిస్తుంటే వాళ్ళ మాటలకి లొంగిపోయాడు.

శ్రీపతి సలహా ప్రకారం కొత్త దంపతులుకొన్నాళ్ళ పాటు ఆ వూరి నుంచి మరో చోటికి వెళ్ళిపోయారు.

# 16

ఆ దెబ్బతో ఊళ్ళో మరింత పేరు ప్రఖ్యాత లొచ్చాయి ప్రెసిడెంటు బుచ్చిరెడ్డికి. తెగపొగడేస్తున్నారు. జనం మరో విషయమైతే పొగడ్తలకి పరమ ఆనంద

భరితుడై గుండాగిపోయి చచ్చిపోనేమో । కానీ, జరిగిం దేమిటి ?

లేదు యీ శ్రీపతిగాణ్ణి తరమాలంటే కరణం రామ మూర్తి పంతులు చెప్పింది ఒక్కటే సన్మార్గం. ఆ పనిచేస్తే తన కీర్తికి హద్దుండదు. గొప్పగావున్న యీ శ్రీపతి వెధవ పత్తాలేకుండా పారిపోతాడు.

అలా ఆలోచనా స్రవంతి సాగుతుండగా బుచ్చిరెడ్డి ముగ్గురు మిత్రులు వచ్చారు.

# 17

ఊళ్లోనూ చుట్టుపక్కల ఊళ్ళల్లోనూ చాటింపులు వేయించారు.

దుర్గంలో కేదారేశ్వరుడి ఆలయానికి పెద్ద కంచు గంట పెట్టిస్తున్నట్టూ దాన్ని శ్రీ శ్రీ శ్రీ ఆరవల్లి సత్యానంద స్వాములవారు ఆవిష్కరిస్తారనీ కాబట్టి అంతా తమకి తోచింది చందాగా యివ్వాల్సిందనీ వేసిన ఆ చాటింపుకి విరాళాలు అధికంగా వస్తున్నాయ్.

డబ్బుని బుచ్చిరెడ్డి అతని ముగ్గురు మిత్రులూ బాగానే మూట గడుతున్నారు.

• • •

ఆర్డరు చేసిన కంచుగంట వొచ్చింది.

అది చాలా పెద్దది. దీర్ఘరోగి దేహం అంత పెద్దది. కదిలిస్తేనేగాని కథ చెప్పుకోలేని దౌర్భాగ్యుడి కొంపలా పెద్ద శబ్దాల్ని తనలో దాచుకున్నట్టుంది దాని ఆకృతి.

# 18

ఆరవల్లి సత్యానంద స్వాముల వారు తమ భక్త కోటితో దుర్గం వూళ్ళోకి అడుగుపెట్టారు.

ఆయన భావాన్నీ హంగామానీ చూసి వూరి జనం ఖిన్నులయ్యారు.

ఆయన ఏవూర్లో మఠం వేస్తే ఆ వూర్లో ఆయన తాలూకు జనం దాదాపు వంద మంది దాకా ఆయన్తో తరలి వస్తారు.

ఒక పోస్టాఫీసూ ఒక బ్యాంకు-ఒక ఆఫీసూ ఆయనతో పాటే వస్తుంది. ఆయనకి సెక్రెటరీలున్నారు.

స్వాముల వారిది చాలా చిన్న వయసు పొడవాటి లాల్చీ వేసుకుంటారు. దానిపై ఫారిన్ సెంట్స్ స్ప్రే చేస్తారు, ఆయన యెక్కడికెళ్తే అక్కడికి కూర్చో దానికి ఖరీదైన సింహాసనం తరలి వస్తుంది.

ఆయన మహిమలు చాలా చాలా

ఆయన చమురులేకుండా గాలిలో దీపం వెలిగిస్తారు. చవిటి నేలలో ఒక ద్వీపాన్నే సృష్టిస్తారు. గాలిలో చెయ్యి తిప్పి మంగళ సూత్రాలు తీస్తారు. నీటిమీదా - గాలిలోనూ నడుస్తారు.

ప్రపంచంలో యే క్షణం యేం జరుగుతున్నదీ ఆయన దివ్య దృష్టి ద్వారా మస్తిష్కంలో దృశ్యీకరించ బడుతుందట.

యివన్నీ తెలుసున్న స్వాముల వారు రేడియో పెట్టుకుని వింటారు.

స్వాముల వారు రేడియో వినడం యెందుకూ?" అని యే నాస్తికుడైనా ప్రశ్నిస్తే.

"వార్తలు వినడానికి" అని జవాబిస్తారు ఆయన భక్తపుంగవులు!

"అవతార పురుషుడైన ఆయన వార్తలు వినటం యేమిటయ్యా మతిలేక?" అని ప్రశ్నిస్తే యేం జవాబు చెప్తారో భక్త పుంగవులు?

అన్నట్టు స్వాములవారుఇంగ్లీషు-హిందీ-సంస్కృత భాషల్లో భాష్యం చెప్పగలరు. అలా చెప్పే ఎడ్యుకేటెడ్ పీపుల్‌ని బాగా ఎట్రాక్ట్ చేస్తున్నారు.

ఆయన భక్తుల్లో చాలామంది చదువుకున్న వాళ్ళున్నారు. భర్తలు విడిచిపెట్టిన భార్యలూ-భార్యలు విడిచిపెట్టిన భర్తలూ వున్నారు. పెళ్ళికాని యువతీ యువకులూ పెళ్ళయ్యి భర్తలూ-భార్యలూ పోయిన విధవలున్నారు.

అదో ప్రపంచం.

బంధుబలగం దుర్గం ఎలిమెంటరీ స్కూలు బిల్డింగ్ లోనూ, ప్రెసిడెంటు బుచ్చిరెడ్డి యింటిలోనూ దిగారు. స్వాముల వారికి మాత్రం పూరిచివర ఒక కామందు బంగ్లా ఖాళీ చేయించి యిచ్చారు. స్వామీజీ వున్నంత కాలం ఆ యింటి పరిసరాల్లో ఆయన భక్త పుంగవులు తప్ప యింకెవరూ మసల కూడదని స్వామి వారి హుకుం.

# 19

ఆ వెన్నెల తెల్లగా వెన్నెల్లావుంది. ఆ గాలి విషాద కన్య వేడిచచ్చిన నిట్టూర్పులానుంది. ఆ నక్షత్రాలు శిల్కారీ అద్దం తుంపుల్లాగా - చంద్రుడు వెండి కుండలాగా వున్నారు

శ్రీపతి, శ్రీపతిలానే వున్నాడు.

అతని ప్రదేశం అతని ఆలోచన్లు అలాగే వున్నాయ్ జరగని మైలురాయిలా అణిగి వున్నాయ్.

యెల్లుండి వుదయం గుడి కంచుగంట ఆవిష్కరిస్తారు.

అదే వుదయం తనని బహిష్కరిస్తారు.

తనకి తెల్సు. యివన్నీ తనకి తెల్సు.

మరి తనకి భవిష్యత్తేమిటి?

దేవుడు నిర్ణయించిన ఆయుషుతో యీ బరువాటి దేహంతో భూమ్మీద బ్రతికేదెలా?

దండకారణ్యానికి పోయి ఆ జంతువుల్లో జంతువుగా యీ ఆవ్వాదనలూ యీ రాగద్వేషాలూ విడిచి అరుణోదయాల్నీ - అసుర సంధ్యల్నీ చూడకుండా బ్రతకడమే అదే శరణ్యం. అరణ్యమే శరణ్యం, అప్పుడే హాయి.

ఆలోచిస్తున్న శ్రీపతికి దగ్గర్లో యేదో గాజుల చప్పుళ్ళు విన్పించాయ్. ఎవరూ యీ వేళప్పుడొస్తుంది. సందేహం వొచ్చినా తలతిప్పి చూడలేదు.

చప్పుళ్ళు మరింత దగ్గరయ్యాయ్.

తను యెవరూ? అని అందామనుకుంటుండ గానే—

"యెవరూ యిక్కడ?" అనే ప్రశ్న అది స్త్రీగొంతు.

తల ఇటుతిప్పి చూశాడు.

తెల్లచీరలో వో స్త్రీ రూపం.

దెయ్యవా?

కాదు.

ఆ స్త్రీ తన పక్కన కాస్త దూరంగా నిశ్శబ్దంగా చతికిల బడింది.

ఆ వెన్నెల జిలుగు వెలుగుల్లో ఆ స్త్రీ నిచూశాడు—

సింద్ బాద్ కథల్లో యువరాణిలా వుందామె.

ముక్కూ - నోరూ - పెదాల చిగుళ్ళు - కంటె నలుపులూ - చెంపల చక్కదనాలూ అన్నీ బావున్నాయ్. అందగత్తె కుండాల్సిన లక్షణాలన్నీ వున్నాయామెలో.

యింతకీ యెవరామె?

"నా పేరు నళిని. స్వాములవారి భర్తురాల్ని."

సన్నటి గొంతుతో చిగురాకుల్లోంచి పలికినట్టు వుచ్ఛరించిందామె.

ఆమె అలా చెప్పడంతోనే తల అటు తిప్పుకున్న

తను గిరుక్కున యిటు తిప్పి—

"అలాగా...... ! ! !" అన్నాడు.

ఆమె మౌనంగా ప్రకృతిని చూస్తోంది.

"యీ సమయంలో మీరిలా వచ్చారేమిటి?"

"మరేం చెయ్యాలి?"

"భక్తులుగదా ! యే ప్రార్థనలో పాదసేవలో వుం టాయి గదా?" అన్నాడు.

ఆమె నవ్విందా ప్రశ్నకి. ఆ నవ్వు సాదాగాలేదు. ఆ నవ్వు ఏదో వింతభావాన్ని వ్యక్తపరిచే నవ్వు. ఆ నవ్వు యేదో వేదాంతాన్ని విపులీకరించేనవ్వు.

''స్వాముల వారి దగ్గరకి నేను భక్తి కోసం— ముక్తి కోసం రాలేదు అందామె.

"మరి ?"

''శాంతి కోసం...... సాంత్వన చాలా అవసరం. మార్ఫియాకోసం దానికి బానిస ఐనవాడు తిరిగినట్టు శాంతి కోసం ప్రపంచమంతా తిరుగుతున్నాను." అందామె.

''మీరు దేవుణ్ని నమ్మరా?" అడిగాడు.

''నమ్మను...... శాంతిలోనే అన్ని వున్నాయని పెద్ద నమ్మకం. కానీ యీ ప్రపంచంలో యెక్కడా- శాంతి లేదు. యీ ప్రపంచంలో విశాలమైన చోటు యెక్కడుం టుందో శాంతి అక్కడుంటుందనీ యింకో నమ్మకం—'

"మీకెక్కడైనా శాంతి లభిస్తే చిన్న కార్డు రాయండి నేనూ వచ్చేస్తాను మీదగ్గరకి." ఆత్రంగా అన్నాడు.

ఆమె శ్రీపతి కేసి చూసింది.

శ్రీపతి ఆమె కేసి చూశాడు.

వాళ్ళిద్దరి కళ్ళలో శాంతికోసం అన్వేషణ స్పషాతి స్పష్టంగా కన్పిస్తుంది.

"మరి యీ స్వాముల వారిదగ్గర దొరికిందా శాంతి?"

అడిగాడు శ్రీపతి

"లేదు యిదో కుట్ర"

"మరి ఆ కుట్రలో యెందుకు యిరుక్కున్నారు?"

"ప్రతి కర్మకీ కొంత గతం వుంటుంది, నాగతం చాలా పెద్దది."

మిమ్మల్ని చూస్తుంటే బ్రతుకులో చాలా గాయపడట్టు అనిపిస్తున్నారు." అన్నాడు శ్రీపతి.

ఆమె నవ్వింది.

"అసలు యీ ప్రపంచంలో విశాలాన్ని తగ్గించి ఇరుకు చేస్తున్నది యీ స్వాములవార్లూ - నమ్మకాలూ — మతభేదాలూ - ఈర్ష్య - కసీ యిదే కారణమేమో!" అన్నాడు.

"నిజం" అంది నళిని.

"పూర్వాశ్రమంలో మీరేం చేశారు?" అడిగాడు శ్రీపతి.

"అదో పెద్దకథ చెపితే తరగదు తరిగేలా చెప్పటం నాకు రాదు." అంది నళిని.

"మీకు ఓపికుంటే చెప్పండి యెంత రాత్రయినా వింటాను. యీ వూరొచ్చినప్పటి నుంచీ యిలా జాగరణలు చెయ్యడానికి బాగా అలవాటుపడ్డాను" అని ముందుకు జరిగాడు శ్రీపతి.

"యీ వూరు రాక పూర్వం ఎక్కడుండేవారు?" అంది నళిని.

"మద్రాసులో వూపిరాడక వచ్చి యిక్కడ యింకో జన్మెత్తాను"

"మద్రాసులో యేం చేసేవారు?"

"కల్మషంలో కల్మషం చూస్తూ బ్రతుకుతూ వచ్చాను"

"మనిషెప్పుడూ బాధల్లోంచి దరిద్రంలోంచి వేదాం

తములోకి వెళ్ళతాడు ఔనా ?" అడిగింది వశిని.

"మీ గత అనుభవాల్లో దరిద్రపు సంఘటన లెక్కువ యేమిటి ?" అన్నాడు శ్రీపతి.

"లేదు ... గతంలో నేను చాలా డబ్బున్న దాన్ని"

"యిప్పుడు ?

"అన్నీ వున్నాయ్. యేమీ లేవు."

"గమత్తుగా వుంది."

"మనిషే గమ్మత్తు."

"ఔను ... అద్సరే మీరెవరూ ... యెందు కొచ్చారిలా ... యెక్కడయినా చిత్తుగా వోడిపోయారా ?"

"యేమో నాకు తెలీదు నా కథ వింటే మీకు తెలుస్తుంది."

"చెప్పండి."

"మీకు తిరువూరు తెల్సా? ఆ వూరు మా వూరే."

ఆ వూళ్లో డబ్బున్న చాలా కుటుంబాల్లో మాది మొట్టమొదటిది.

నలుగురు అన్నలకీ ఆఖరిగా నన్నూ కనీ మా అమ్మ స్వర్గం వెళ్ళింది. మా నాన్నగారు యీ లోకంలో వుండే స్వర్గాన్ని అనుభవిస్తున్నారు.

ఆ రోజుల్లో నాకు ఊహ తెల్పేదికాదు. చాలా చిన్నదాన్ని. పట్టు పరికిణీలూ చిన్ని చిన్ని జాకెట్లూ కట్టుకునే దాన్ని. నా దేహంనిండా రకరకాల నగలుండేవి. శరీరానికి అద్దిన గంధం పౌడరూ, కళ్ళకి దిద్దిన కర్పూరపు కాటుకా యివన్నీ ఆ వయసులో ఆ తనంలో నాకు చాలా యిబ్బంది పెట్టేవి. వొళ్ళంతా బరువు.

మా నాన్నా అన్నలూ హోదా దర్జా అనేవారు.

ఈ హోదా దర్జా లేకుండా వుంటే వొంటికి వొక్కమాలుపోగుకూడా అంటదేమో ! అలా ఏ అచ్ఛాదనా

లేకుంటే బాగుండును అన్పించేది నాకు.

రాను రాను నా దేహం యెదగసాగింది.

వొంట్లో పొంగే సొంపులతోపాటు యేదో నాకు తెలీసీ నేనెరగనీ విద్యుత్తు ప్రవహించేది.

"అది వయసన్నారు."

కామోసు అనుకున్నాను.

నా అధరాలు పగడాల్లా – నా చెంపలు గులాబుల్లాగా – నా కేశాలు తిమరంలాగా - నా గుండ్రటి రొమ్ముల మధ్య లోయల్లాగా ... యిలా నా దేహం అంతా వింతగా సొంపుగా యెదుగుతున్నాయి. యెదిగే దేహాన్నీ తరిగే కాలాన్నీ అడ్డుగా నిలబడి యెవరాపగలరు. ఐనా యెందుకు ఆపాలి? ఆహారం విషయంలోనూ ఆహార్యం విషయంలోనూ నేనెంత నిర్లక్ష్యంగావున్నా అవి చూపరులకి అందగానే కన్పించేవట.

మా అన్నలూ నేనూ వొక కాలేజీలో చదివేవాళ్ళం.

శశికాంత్ అంట అతని పేరు. నన్ను ప్రేమించాడట. నా కోసం పరితపించేవాడు. నేనతని కోసం పరితపించే దాన్నికాదు.

మా అన్నలకి యీ విషయం తెల్సి అతన్ని చితకతన్ని చెయ్యి విరగ్గొట్టారు.

పాపం దెబ్బలు తిన్న శశికాంత్‌ని చూడ్డంతో అతని మీద యెక్కడలేని ప్రేమ–జాలీ పుట్టుకొచ్చాయ్....

కానీ. నా ప్రేమ పొంగకుండానే శశికాంత్ ఆవూరి మంచి పారిపోయాడు.

మా రెండో అన్న "దయ" అనే అమ్మాయిని ప్రేమించాడట.

"దయ"కి అసలు దయవుందో లేదో కానీ చాలా సింపుల్‌గా అందంగా నల్లగా వుండేది.

మా చిన్నన్నని ఆమె తిరస్కరించింది.

మా చిన్నన్న కళ్ళలో యెక్కడ లేని క్రూరత్వం కన్పించింది. మరుసటి రోజునుంచి ఆమెని యెక్కడ కన్పిస్తే అక్కడ అవమానించేవాడు. మాటల అమ్ములతో గాయపరిచాడు.

వోరోజు మెయిన్ రోడ్డుమీద ఆ దయ తెల్ల జాకెట్టు వీపు భాగాన్ని మా చిన్నన్న చింపేశాడు.

మరుసటిదినం దయ అంకుల్ వొకతను మాచిన్నన్న దగ్గరకొచ్చి చాలా నమ్రతతో మీరు చేసేపని మంచిది కాదు. ఆమె నాకు కాబోయే భార్య అని చెప్పబోతే మా చిన్నన్న అతన్ని చితక బాదాడు.

మా చిన్నన్న చేసింది గర్వంగా చెప్పుకుంటూ నవ్వుతుంటే నాక్కూడా నవ్వొచ్చింది.

నాకొచ్చిన నవ్వు మా చిన్నన్న కొచ్చిన నవ్వు లాంటిది కాదు.

మా నాన్న చనిపోయారు.

మా అన్నల ఇరుకు మనసులు కుళ్ళూ యీర్ష్యలతో నిండిన మనసులు అప్పుడు బయటపడ్డాయ్.

నాకు పెళ్ళి చేసేసి తక్కిన ఆస్తిలో సూది పిన్నీసుతో సైతం ముక్కలుగా పంచుకుందామనేది వాళ్ళ ధోరణి.

నా కొద్దు పెళ్ళి అన్నాను.

సరే అని నాక్కొంత ఆస్తిని పారేసి తక్కినదాన్ని చిల్ల పెంకులతో సైతం పంచుకుని యెవరి దార్న వాళ్ళు పోయారు

నాకు నా దేహం మీదా జీవితం మీదా చాలావిరక్తి పుట్టుకొచ్చింది.

మనసుకు స్వాంతన కలగజేద్దామని, కళ్ళతో సూన్యతాన్ని చూద్దామని అనాటి నుంచీ యీ దేశంలో చాలాచోట్ల

తిరిగి యెక్కడా అనుకున్నది దొరక్క యీ స్వామీజీ దగ్గరకొచ్చాను.

యీ స్వాములవారి మఠాన్ని చూశాక లోకంలో కుళ్ళుని చూడ్డానికి వేరే అనుభవాలక్కరలేదు. యీ చిన్న స్వాములవారి ప్రపంచం చాలు అనిపిస్తుంది.

యీ మఠంలోకి నేనొచ్చి రెండేళ్ళు దాటుతుంది

మరో మజిలి ఎక్కడికో. బహుశా అదే నా ఆఖరి మజిలీ కావచ్చు" అని తన కథ చెప్పడం ఆపింది నళిని.

అంతా విన్న శ్రీపతి సిగరెట్ వెలిగించి,

"మీకు అభ్యంతరం లేకుంటే నాదగ్గర వుండిపోండి. మనిద్దరం ఒకేరుగ్మతతో కొట్టుకుంటున్నాం. కాబట్టి మనకో మనకి కొన్ని అవగాహనలు ఏర్పడితే కాస్త శాంతినిపొంది కాసింత హాయైన వూపిరి పీల్చుకుని చావొచ్చాకా చని పోదాం... ఏమంటారు?" అన్నాడు శ్రీపతి.

నళిని తలవూపింది సరే అన్నట్టు.

"మళ్ళీ రేపు కలుద్దాం లేవండి" అనేసి ఆమె భుజం మీద చెయ్యేసి లేవదీశాడు.

# 20

స్వాములవార్ని ఉదయం ఏడుగంటల్నుంచి తొమ్మిది వరకూ భక్తులు దర్శనం చేసుకోవచ్చు. ఆ తర్వాత ఆయన వ్యాపకాలు వేరే వుంటాయ్.

గుడి కంచుగంట రేపు ఆవిష్కరిస్తారనగా ఆ దినం ఉదయం స్వాములవార్ని దర్శనం చేసుకునే నిమిత్తం బయల్దేరాడు శ్రీపతి.

"గుడ్మార్నింగ్!"

మౌన ముద్రలోవున్న స్వాములవారు గిరుక్కున

తలెత్తి చూశారు. అంతా ఆయన పాదాల్ని స్పృశించాక కళ్ళుమూసి తపస్సులో లీనంఐన స్వాములవారు "లేబాబూ!" అని గానీ "లే అమ్మా!" అని గానీ అన్డం ఆయన దైనం నది జీవితంలో జరుగుతూ వస్తుంది. అలాంటిది యీ మోడ్రన్ మనిషి యిలా పలకరించడంతో గిరుక్కున తలెత్తి చూశారు స్వాములవారు.

"బావున్నారా?" అడిగాడు శ్రీపతి.

"ఎవరు భక్తా నువ్వు?" శాంతంగా అడిగారు స్వాములవారు,

"నేను తమ భక్తుణ్ణికాను" అనేసి ఆయనకి దగ్గరగా కూర్చున్నాడు.

స్వాములవారికి గుండెల్లో దడపుట్టింది

"నేను తమర్ని కొన్ని ప్రశ్నలు వెయ్యాలనుకుంటున్నాను...మీరు వొద్దన్నా సరే" అన్నాడు శ్రీపతి.

స్వాములవారికి దడ జాస్తి అయింది.

"సరే— మీరు నా సందేహాలకి సమాధానాలు ఇవ్వ లేదన్పిస్తుందా - ఓకే— తమరు తమ దివ్యశక్తుల ప్రభావంతో నీటిలో నడుస్తారని విపికిడి. దయచేసి రేపు మా వూరి ఏటిలో నడిచి మమ్మల్ని పునీతుల్ని చేస్తారని ప్రార్థిస్తున్నాను" అనేసరికి శ్రీపతి ఆ స్వాముల వారు విలవిల్లాడి పోయారు.

"దానికి మాకు సమయం కావాలి." అన్నాడు స్వాములవారు

"మీరు గాలిలో చెయ్యి తిప్పి రకరకాల వస్తువుల్ని సృష్టిస్తారట. నాకు రెండు ఫారిన్ స్కాచ్ బుడ్లు కావాలి ... నేను సాయంత్రం లోపు మా వూరిలో భక్తులందరినీ వెంటబెట్టుకొని వొస్తాను. మీరు మీ మహాత్మాలన్నింటినీ మాకు కళ్ళకి కట్టినట్టు చూపిస్తారని కోరుకుంటు

న్నాం." అని లేచి వేగంగా వెళ్ళిపోయాడు శ్రీపతి.

శ్రీపతి అలా వెళ్ళడంతోనే స్వాముల వారు వెంటనే సెక్రెటరీని పిల్చి వెంటనే మనం వెళ్ళిపోవాలి... మనకి యీ వూళ్ళో అవమానాలు జరుగుతున్నాయ్. మాన భంగాలు జరుగబోతున్నాయి... వెంటనే నువ్వు వెళ్లి యీ వూరి పెద్దల్ని వెంటబెట్టుకు రావల్సింది." అన్నాడు.

సెక్రెటరీ వెళ్ళిపోయాడు.

వూరి పెద్దలు నల్గురూ వొచ్చి జరిగిన తప్పిదానికి మమ్మల్ని క్షమించ మంటూ లబోదిబో మన్నారు.

వాళ్ళ మాటలు స్వాములవారు యెంతమాత్రం వినలేదు.

"బాబూ ! తమ వద్దకి వొచ్చి అలా అవమానించిన వ్యక్తి చాలా దుండగుడు... వాడు ఈ వూరు నాశనం చెయ్యడానికే వొచ్చాడు. వాడు యీ గుడికి పూజారికూడను అని మొత్తుకున్నారు.

"అలాంటి పూజారులు వుంటే యీ వూళ్ళో తప్ప కుండా గ్లాని సంభవిస్తుంది ... అతన్ని వెంటనే ఆ గుడి నుండి బహిష్కరించండి" క్రోధంగా అన్నారు స్వాముల వారు.

"చిత్తం .... తమరు చెప్పినట్టు అక్షరాలా పాటిస్తాము, దయచేసి ఆ తప్పిదం మాదిగా మమ్మల్ని మన్నించగలరని ప్రార్థితులం" అన్నారు ఊరి పెద్దలు.

వాళ్ళ మాటలు ఏమాత్రం లక్ష్యపెట్టకండా వెంటనే బయలుదేరారు స్వాములవారు.

ఊళ్ళో పెద్ద పుకారు లేచింది.

స్వాములవారు అలా హఠాత్తుగా పలాయనం చిత్త గించడానికిగల కారణం యీ ఊరి రౌడీ దొంగ అయిన గుడి పూజారి శ్రీపతి — శ్రీపతి.

వెంటనే శ్రీపతిని బహిష్కరించాలి. ఈవూర్నుంచే జనం నినాదాలు చేశారు.

నిజంగానే గుడిగంట ఆవిష్కరించ కుండానే స్వాములవారు వెళ్ళిపోయారు.

శ్రీపతిని పూజారి పదవిలోంచి శాశ్వతంగాతీసేశారు.

స్వాములవారు తమ జనాభాతో వెళ్ళిపోయినా ఆయన భక్తుల్లో వొకర్తె ఐన నళిని శ్రీపతి కోసం వుండిపోవడంతో జనం మళ్ళీ ఖిన్నులయ్యారు. యెన్ని పాపాలకి వొడి గడ్తున్నాడు వీడు!

సారాయి తాగుతాడు.

మాంసంతింటాడు.

కేదారేశ్వరుడి గుడిలో గంటలు దొంగిలించి దొంగ అయ్యాడు.

రాజేశ్వర్రావు మేస్టారు కూతురు రామేశ్వర్ని చెరిచి పాపాత్ముడయ్యాడు.

యింకా యెన్నెన్నో పాపాలు లెక్కలేనన్ని చేశాడు.

పూర్వ జన్మలో నరమాంస భక్షకుడై వుంటాడు.

కంపితుడు, పాపాత్ముడు యిలా — యిలా వొకటి కాదు వందల తిట్లు తుఫాను శ్రీపతిమీద కురిపించారు జనం.

• • •

ఆ ఊరికి మైలుదూరంలో వో తాటాకు పాకవేశాడు శ్రీపతి.

తనతోపాటు నళిని కూడా వుంటుందా పాకలో

ఊరి గుడికి కొత్త పూజారి వొచ్చాడు.

మళ్ళీ భక్తులు వరదలా గుడికి వెళుతున్నారు.

ఊరు మళ్ళీ మొదట్లానే వుంది.—

ఊరి జనానికి ధర్మ ప్రభులూ- దైవభక్తుడూ ఐన బుచ్చిరెడ్డి అతని మిత్రులూ యధాతదంగా తమ కార్య క్రమాలు సాగిస్తున్నారు.

ఓరోజు సాయంత్రం బుచ్చిరెడ్డి యింటి అరుగు మీద నలుగురు మిత్రులూ బిశాణా పేశారు.

"దైవాంశ సంభుతులు అయిన ఆ స్వాములవార్ని అవమానించిన యీ వెధవకి పుట్టగతులుంటాయా రామ్మూర్తి అన్నాడు రాజేశ్వర్రావు మేష్టారుతో.

"అంతటితో అయిందా ... ఆయన మఠంలో భక్తు రాల్ని వలలో వేసుకున్నాడు అదెంత పాపం ?" అన్నాడు మున్సబు నరసింహం.

"ఆ భక్తురాలు చాలా అందంగా వుంది. యెవరో జమిందారిణి అట" అన్నాడు బుచ్చిరెడ్డి.

అందరి మాటలు వింటూ ఆలోచిస్తున్న రామ్మూర్తి "అంతటి జమిందారిణిని వలలో వేసుకున్నాడంటే వాడేదో పెద్ద ప్లాను లోనే వున్నట్టు నా అనుమానం." అన్నాడు రామ్మూర్తి.

ఆ భక్తురాలి వద్ద చాలా డబ్బూ నగ నట్రా వున్నా యట. దానికోసం యీ వెధవ అత్యాస పడుతున్నా డన్నమాట??

• • •

"నీ డబ్బూ—నగలూ ఎక్స్ట్రా ధనం కోసం నీకు నేను చేరువయ్యాననే సందేహం నీకులేదుగదా!" ఆ రాత్రి తన వాళ్ళో మగత నిద్రపోతున్న నళినిని అలా అడిగాడు శ్రీపతి.

పడుకున్నదల్లా వులక్కిపడి లేచింది.

"యింతటి తప్పుడు ఆలోచన నీకెలా వొచ్చింది?" కోపంగా అడిగింది నళిని.

"నీ మనసు నాకు తెల్సు నళినీ! యీ వొక్క ప్రశ్న వెయ్యాలనే నిశ్చయంతో వేశాను అంతే"

"యింకెప్పుడూ వెయ్యవు కదూ?"

"ఇకముందు జీవితంలో ప్రశ్నే వెయ్యను సరా!"

నవ్వింది నళిని. మళ్ళీ అతని వొళ్ళో మత్తుగా నిద్రోతుంది.

"శ్రీపతీ!"

"వూఁ"

"అసలు నీలో యీ ప్రశ్న యెలా వుదయించింది?"

"యేమో!"

"వెనుకటికి నేనో పుస్తకం చదివాను శ్రీపతీ! అందులో నాకు నచ్చిన వాక్యం వొకటుంది"

"చెప్పు!"

"యే కార్యమైనా చక్కగా సాధించి ప్రయోజకులు కావాలంటే, యితరులకు వుపయోగపడి సౌఖ్యం కలిగించాలంటే మనిషి తన అంతరాత్మనీ-కారుణ్యాన్నీ న్యాయ బుద్దినీ యుక్తా యుక్త వివేకాన్నీ చంపుకోవాలట."

"భలే...నవ్వొస్తుంది"

"సరే...నిన్నో ప్రశ్నవెయ్యనా శ్రీపతీ!"

"ఏమిటి?"

"యీ లోకంలో ఆరోగ్యవంతుడైన మనిషన్న వాడుంటాడా?"

"నా వరకూ లేడు ... లేకపోవడానికి కారణం మనిషికాదు సృష్టికర్త."

"యెలాగా!"

"ఈర్ష్య-కల్మషం-పిరికితనం...యివి మనిషి పుట్టడంతోటే పుట్టిన రోగాలు, నా దృష్టిలో శారీరకమైన రోగాలు అసలు రోగాలే కావు నళినీ!"

"నీ వరకూ?"

"అది నువ్వే పరీక్షించాలి నళినీ!"

"సరె అయితే నీకో కథ చెప్తాను...వింటావా?"

"చాన్నాళ్ళక్రితం భీమిలి చూడాలని బయల్దేరిన నాకు నేనెక్కిన బస్సులో స్టీవెన్స్ అని ఒక క్రిస్టియన్ యువకుడు పరిచయం అయ్యాడు.

బస్ సముద్రం వొడ్డున ప్రయాణం చేస్తుంది. నా పక్కనే కూర్చున్న స్టీవెన్స్ మాటిమాటికి కిటికీలోంచి తలపెట్టి సముద్రాన్ని చూసేవాడు. అతని చేతిలోవున్న సింగిల్ లెన్స్ కెమెరాతో బస్ పాస్ అవుతుండగానే ఫొటోలు తీసేవాడు.

అతని వూపిరి నాకు తగిలేది.

అతని దేహం మెత్తని నా వొంటికి తగిలేది.

నన్నుకూడా ఫొటో తీస్తానన్నాడు.

బస్ భీమిలిలో ఆగేలోపు మేమిద్దరం కల్సిపోయాం.

చాలా యేళ్ళగా స్నేహితుల్లా మాట్లాడుకున్నాం.

ఒకరిభుజాలమీద వొకరం చేతులేసుకుని బీచ్ అంతా తిరిగాం.

రాత్రి వైజాగ్ తిరుగు ప్రయాణ మౌతుండగా యింకా బయల్దేరని బస్ లో అతనన్నాడు.

"వైజాగ్ లో యెక్కడ దిగారు?"

"హోటల్లో" చెప్పాను.

"నేను...యూనివర్శిటీలో చదూతున్నాను. హాస్టల్లో వుండటం యిష్టంలేక బయట రూము తీసుకున్నాను. నా రూమ్ కొస్తారా?"

నేను జవాబు చెప్పలేదు.

కాస్సేపయ్యాక "అలాగే వొస్తాను" అన్నాను.

అతను చాలా సంతోషించాడు.

బస్ కదిలింది.

యిద్దరం యింకేం మాట్లాడుకోలేదు.

నేను స్టీవెన్స్ రూపాన్ని చూస్తున్నాను. అతనేదో పుస్తకం తీసుకున్నాడు.

స్టీవెన్స్ తెల్లగా-పొడుగ్గా వుంటాడు. మెత్తటిజుట్టూ గాజు కళ్ళు, చాలా అందంగా కన్పించాడు స్టీవెన్స్.

అంతవరకూ యే మగాడూ అంత అందంగా నాకు కన్పించలేదు. అతని రూమ్‌లోనే అతనితోపాటు వుండి పోవాలన్పించింది.

ఆ ఆలోచన వైజాగ్ చేరేలోపు ఆశయంగా స్థిరపడి బలపడిపోయింది.

ద్వారకానగర్ బస్‌స్టాప్‌లో ఆగింది బస్.

దిగి రిక్షాలో అతని రూమ్ కెళ్ళాం.

వో మేడ మీద చాలా అందంగావుంది అతని రూమ్. షెల్ఫ్‌లో చాలా పుస్తకాలున్నాయ్. అందులో కొన్ని క్రిస్టియానిటీకి సంబంధించినవి. అతని టేబుల్‌మీద రకరకాల పుస్తకాలతో పాటు వో ఫ్రేమ్‌లో బంధించ బడ్డవో అందమైన అమ్మాయి ఫ్రొఫైల్ కన్పించింది.

"యెవరు?" అడిగాను,

"లీసా... నా ప్రేయసి." చెప్పాడు.

ఆ క్షణంలో నేను ఈర్ష్యపడ్డానా? లేదు...లేదు.

భోంచేశాక నేను మంచం మీద కూర్చున్నాను..

షెల్ఫ్‌లోంచి వో పచ్చటి కాలికో బైండ్ తీసి నాకు ప్రెజెంట్ చేస్తునట్టు చెప్పియిచ్చాడు స్టీవెన్స్.

ఆ పుస్తకం పేరు హోలీబైబిల్. తొమ్మిది వందల నలభై రెండు పేజీల వుద్గ్రంథం అది. నాకు మతాలన్నా మత ప్రచారకులన్నా చాలా చిరాకు. అదే అన్నాను అతన్తో.

"పోనీ నా గుర్తుగా వుంచుకో." అని నవ్వాడు.

నీకోసం చదువుతాను కూడా!! అన్నాను నేమో నవ్వి.

అతను చాలా ఆనందంగా నా నల్లటి జడ వెనక తెల్లటి మెడమీద చెయ్యేసి రుద్దాడు.

లైట్ ఆఫ్ చేసి అదే బెడ్ మీద పడుకున్నాం.

"స్టీవెన్స్?"

"ఏస్"

"నువ్వెవర్నన్నా ప్రేమించావా?"

"లీసాని."

"నేను నిన్ను ప్రేమిస్తున్నాను భరించగలవా?"

"లీసా భరించలేదు...... కొబట్టి నేనూ భరించ లేను.

"నీ రూపం అంత అందంగా లేదు నా హృదయం."

"మనిషికి దేవుడు అన్నీ అందంగా అమర్చడు నాసీ!"

"యెందుకు అమర్చడు."

"అలా చేస్తే దేవుడికంటే మనిషే గొప్పవాడౌతాడు. అప్పుడు దేవుడికి మనిషి మీద ఈర్ష్య పుట్టేస్తుంది. యేదో జరిగిపోతుంది."

"బావుంది నీవాదం... ముందు నా ప్రశ్నకి జవాబు చెప్పు నేను నిన్ను ప్రేమిస్తున్నాను ... ఆరా ధిస్తున్నాను.

"కానీ నేను ప్రేమించలేను. గతంలో ప్రేమించిన నా ప్రేయసి ఈర్ష్య పడుతుంది" అని నా నడుంచుట్టూ చెయ్యివేసి నన్ను తనకి దగ్గరగా బాగా దగ్గరగా అదుము కున్నాడు.

"నాకు వూపిరి ఆడటం లేదు" అన్నాను.

"నాతోవుంటే జీవితమంతా నీకు వూపిరాడదు"

''నువ్వనుకున్నంత ఈర్ష్య నాలోలేదు"

"నాకుంది" అని నా పెదవుల్ని తన పెదవుల్లో కలుపుకున్నాడు.

నేనింకా నిద్రలేవకుండానే తెల్లవారింది.

ఏవో మాటలు విన్పిస్తున్నాయ్.

యెవరిదో ఆడగొంతు స్టీవెన్స్‌ని దూషిస్తుంది.

"యెవరదీ నా స్థానాన్ని ఆక్రమించుకుంది. వెంటనే పంపించెయ్యి. లేదా నీతో నేను కట్ చేసుకుంటాను... అది వెళ్ళే వరకూ నీ దగ్గరికి నేను రాను'' అంటుంది.

అలా అరగంట అతన్ని తిట్టి వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళాకా స్టీవెన్స్ నన్ను నిద్రలేపి

"జీవితంలో మొట్టమొదటి సారిగా నన్ను తిట్టింది నా లీసా. దయచేసి వెళ్ళిపో ... వెంటనే" అన్నాడు స్టీవెన్స్.

నా పరిస్థితిలో వున్న మరో ఆడదానికైతే తన మీద తనకి అసహ్యం కలిగేది. కాపీ నాకదేం కలగలేదు. సహజంగా ఆడదానికెంత ఈర్ష్యవుందో గుణించి భాగించాను ఆ క్షణంలో.

స్టీవెన్స్ చెప్పినట్టే అతన్ని విడిచిపెట్టాను"

అని కథ ముగించింది నళిని.

అంతావిన్న శ్రీపతి ఆలోచిస్తూ వుండిపోయాడు.

"నేను స్టీవెన్స్‌ని ప్రేమించానంటే నీకు నా మీద అసహ్యంగానూ, ఈర్ష్యగానూ వుందా?" అని శ్రీపతిని అడిగింది నళిని.

ఆమె ప్రశ్నకి నవ్వేశాడు శ్రీపతి.

"నళినీ! నువ్వు తెలిసి అడుగుతున్నావో తెలియక అడుగుతున్నావో నాకు తెలీదుగానీ! నేను మనిషికి స్వేచ్ఛ కావాలనే వాదంతో బ్రతుకుతున్నాను. యికప్రపంచంలో పుట్టేటోయే మనుషులు ఈర్ష్యా రహితులు కావాలని ఆశిస్తున్నాను. అలాంటి నేను నీమీద యెలా ఈర్ష్య పడతాను?" అని నళినిని గుండెల మీదికి తీసుకుని అదుముకున్నాడు.

"నువ్వు నాకు దొరకడం నిజంగా నా అదృష్టం శ్రీపతీ!" అని లేచి తన పెట్టెలో యెంతకాలంగానో దాచిన పాయిజన్ బాటిల్‌ని తీసుకొచ్చి వోసారి శ్రీపతికి చూపించి బైటికి విసిరేసి మళ్ళీ శ్రీపతి వొళ్ళో నిశ్చింతగా పడుకుంది నళిని.

"నళినీ!"

"వూఁ"

"రేపటినుంచి నేను మారిపోతున్నాను."

"యెలాంటి మార్పు?"

"చూద్దువుగాని."

# 21

వూరి వాళ్ళసలు శ్రీపతి-నళినీ వుండే పరిసరాలకి పోవడంలేదు. నిజానికి వూరివాళ్ళకి ఆ ప్రదేశాల్లో పన్లుండవు. అవన్నీ బంజరుభూములు. ఆ యెద్దటి నేలలో వోపచ్చటి చెట్టయినా కన్పించదు.

రెండువారాల తరువాత—

రామారెడ్డి అనే అతను వూరికి దక్షిణంగా మైలు దూరంలోవుంది శ్రీపతి వాళ్ళ పాకవేపు యేదోపనుండివొచ్చి

ఆ పాక అరుగు మీద ఆ దృశ్యం చూసేసరికి వాడి తల తిరిగిపోయింది.

ఆ దృశ్యం—

కాషాయవస్త్రాలూ-పెద్ద జుట్టూ గెడ్డంతో వో సాధువు ఆ అరుగుమీద మౌనవ్రతంలో వున్నాడు. వొక భక్తురాలు ఆ సాధువు పక్కనే కూర్చుని భగవద్ధ్యానంలో వుంది.

రాజారెడ్డి ఆ పాకకి మరింత దగ్గరగావెళ్ళి ఆ సాధువునీ ఆ భక్తురాల్నీ తేరిపారజూశాడు. అనంతరం ఠంగై పోయాడు.

మా వూరి దొంగ, రౌడీ ఐన శ్రీపతి యిలా మారి పోయాడేమిటబ్బా! అని చాలా ఆశ్చర్యపోయాడు దుర్గం వాస్తవ్యుడైన రాజారెడ్డి.

వెంటనే వూళ్ళోకెళ్ళి చాలామందికి యీ విషయం చెప్పాడు.

ఆ మాటలు చెప్పిన రాజారెడ్డిని వూరిజనం-పెద్దలూ చెడామడా తిట్టారు. యెడాపెడా వాయించబోయారు.

పచ్చి రౌడీవెధవ. తాగి దేవుడికి అర్చనచేసిన వెధవ సాధువయ్యాడా? దొంగముక్క వాడి నాటకాల్ని నమ్మకండి అని తెగతిట్టిపోశారు వూరిపెద్దలు.

జనం కూడా ఔనౌను అని వంతపాడారు.

అలా శ్రీపతి వునికి పట్టించుకొని వూరిజనం ...

ఆ రోజు జరిగిన సంఘటనకి మతులు పోగొట్టు కున్నారు.

ఆ రోజు జరిగిందేమిటి?—

దుర్గం పక్కనే వున్న మరో గ్రామం మల్ల

సముద్రంలో యేదో సినిమా షూటింగ్ జరుగుతోందట.

ఆ పిక్చర్‌లో హీరోయిన్ ఆ రోజు కారులో దుర్గం వూళ్ళో కొచ్చి. శ్రీపతి వునికి తెల్సుకుని అతని పాక దగ్గరకి వొచ్చింది.

ఒక పెద్ద సినిమా హీరోయిన్ యెందుకూ పనికిరాని వెధవ శ్రీపతి గాడి దగ్గరకి వెళ్ళడమేమిటి?

జనం అంతా విడ్డూరంగా అనుకుంటున్నారు.

చెప్పుకుని అబ్బురపడ్తున్నారు.

ఆ సినిమా స్టార్ పాకముందు కూర్చుని మౌన వ్రతంలో వున్న శ్రీపతి పక్కన కూర్చుంది.

"శ్రీపతీ!"

"యెవరూ?"

"నేను... సధీని,

"నువ్వా... యెందుకొచ్చావ్?"

"నీకోసం,"

"నాలో ఏముంది నాతో యేంపని ?"

"నీలో నా జీవితం వుంది. నీతోనే నాపనంతా."

"శ్రీపతి అసలు పేరు శూన్యం."

"నాకిప్పుడు శూన్యమే శరణ్యం ... నిన్ను అజ్ఞాతంగా ఆరాధిస్తున్నాను నాతో వచ్చెయ్యి పతీ!"

"యెక్కడికి ?"

"నాతోపాటు."

"యీ ప్రదేశం విడిచి మరెక్కడికీ యింకెక్కడికి రాలేను సధీ! యిదే నా ప్రపంచం... యిక్కడే నాప్రపంచాన్ని సృష్టించుకుంటాను. నీకూ ఇష్టమైతే ఇక్కడే వుండిపో."

"నీకోసం నేను యేదైనా చేస్తాను. నీ కోసం బ్రతుకునే మారుస్తాను."

"వొద్దు.... వొద్దు... సధీ! నిజానికి నాలో అణిగి మణగిన భావాలకి వూపిరి పోసింది నువ్వే... నీ జీవితాన్ని మార్చుకోవద్దు."

శ్రీపతిని అలా చూస్తూవుండిపోయింది సధీ.

సధీని శ్రీపతి చూస్తున్నాడు.

యిద్దర్నీ వింతగా చూడ్డంలేదు అక్కడున్న సఖి.

కానీ ఆ యిద్దరిమధ్య యేదోకథ వుందని ధృవపడక పోతుందా!

"ఐతే నాతో రావన్నమాట."

"యీ లోకంలో నేనెవరికీ సొంతంకాదు. నాకూ యెవరూ సొంతంకాదు."

"నా ఆక్రోశం నీకు ఆనందమైతే రావొద్దు."

"సధీ యింతతెల్సిన ఆడదానివి చిన్న సమస్యకి ఇంత చిన్నపిల్లగా మారిపోతుంటే నాకు నవ్వాగటంలేదు."

"యిది చిన్నసమస్య కాదు."

"నా వరకూ చాలా చిన్నది."

"నన్నేడిపించటంకోసం యిది నీకు చిన్నసమస్యగానే కన్పిస్తుంది! యీ కన్నీరు చూడు."

"ఏడ్చే ఆడదంటే నాకు చాలా అసహ్యం."

"నీ కోసం నేను మారిపోయినందుకే యిలాఏడుస్తూ అశాంతి భరించాల్సి వస్తోంది."

"మవ్విలా మారిపోయావ్ గనుకే యిలా అశాంతిగా

బ్రతుకుతున్నావ్. వెళ్ళు సఖీ! నీ లోకంలో నీకు సరిపోయే విధంగా బ్రతుకు... వెళ్ళు... వెళ్ళు"

సఖీ బయలేరింది.

ఊళ్ళోంచి సఖీ కారు వెళ్తుంటే జనం కారుమీద విరగబడ్డారు.

మీరు నటించే సినిమాలంటే మాకిష్టం.

మీరిప్పుడు యే సిన్మాల్లో నటిస్తున్నారు?

యీ పూటకి మా యింట్లో భోజనానికి వుండండి అంటున్నారు జనం.

సఖీ జనంకేసి చాలా కోపంగా చూసింది.

"నేనెవరనుకుంటున్నారు మీ యిళ్ళల్లో భోం చెయ్యడానికి?" అంది.

"యేం మేం ఆ వూరి చివర అంటు బ్రతుకు బ్రతికే రౌడీకంటే తక్కువా?" అన్నారు.

"ఔను... అతను దేవుడు... నా దైవం"

సఖీ కారు వెళ్ళిపోయింది.

జనం సఖీని చాలా విడ్డూరంగా చూశారు.

జనంలో కంగారు. అంతా రౌడీగా వూహించిన, శ్రీపతికి ఎంత గౌరవం ఆపాదించిందీ ఈ మహారాణీ!!

జనానికి యెంత ఆలోచించినా ఈ సంఘటన చాలా విడ్డూరంగా తోస్తుంది.

వాళ్ళ ఆలోచన్లు తల్లక్రిందులవుతున్నాయ్.

# 22

సినిమారాణీ ప్రభావం వల్లనైతేనేం- మరేదైతేనేం వూరివాళ్ళకి శ్రీపతిపైన కాస్త గౌరవం కలిగింది.

శ్రీపతి సాధువు ఐపోయాడు. బహుశా స్వాముల వారి శాపం వల్ల కాబోలు. లేదా ప్రస్తుతం శ్రీపతి దగ్గర వుండే స్వాముల వారి భక్తురాలి మహిమ వల్ల కావచ్చు. ఆమే శ్రీపతిని సన్యాసిగా మార్చేసి వుండవచ్చు.

సాయంత్రంవేళలు సన్యాసి ఐన శ్రీపతి దగ్గరకెళ్తే భవిష్యత్తు గురించి జాతకాలు చాలా మంది విషయాల్లో నిజం ఔతున్నాయట.

యీ పుకార్లతో సాయంత్రం అయ్యేసరికి శ్రీపతి ఆశ్రమం (పూర్వమైతేపాక) ముందు జనం కాస్తయెక్కువే వుంటున్నారు.

చూసొచ్చిన జనం తమకి ధర్మపాలకుడూ – కేదారేశ్వరుడి పరమభక్తుడూ ఐన బుచ్చిరెడ్డిగారికీ అతని మిత్రులకీ చెప్తున్నారు.

మరో నెలకి శ్రీపతిపేరు ఆ చుట్టుప్రక్కల మారు మ్రోగిపోయింది.

# 23

ఆ రోజు కరణం రామ్మూర్తి బయల్దేరాడు శ్రీపతి దగ్గరికి.

వూరికి మైలు దూరంలో నిశ్శబ్దమైన వాతావరణంలో వున్న ఆ ఆశ్రమం అరుగుమీద కాషాయవస్త్రాల్లో పెరిగిన గెడ్డంతో మౌనంగా కూర్చున్నాడు శ్రీపతి.

అతని పక్కనే ఆశ్రమ వాసిని నళిని.

ఆశ్రమం చుట్టూ చూశాడు రామ్మూర్తి.

పచ్చని చెట్లూ–తీగలూ– చల్లటిగాలీ చాలా హాయిగా

వుందా వాతావరణం.

మౌనవ్రతంలో వున్న శ్రీపతి దగ్గరకెళ్ళి కూలబడ్డాడు రామ్మూర్తి

చాలా సేపటికి కళ్ళుతెరవకుండానే అన్నాడు శ్రీపతి.

"ఎవరు బాబూ నువ్వు ?"

ఆ ప్రశ్నకి రామ్మూర్తి పంతులు అదిరిపడ్డాడు.

"నన్ను...నన్ను తమరెరగరా స్వామీ!" అదురుతూ అన్నాడు రామ్మూర్తి.

అతని ప్రశ్నకి తాత్వికమైన దరహాసాన్ని విడిచి.

"నన్ను నేనే ఎరగను బాబూ !" అన్నాడు శ్రీపతి.

ఈ మాటకి మరింత కంగారు పడ్డాడు రామ్మూర్తి.

"ని...నిజంగా తమరు నన్నెరగరా స్వామి ?" మళ్ళీ రామ్మూర్తి సందేహం.

"యీ ప్రపంచంలో యెవర్నీ నేనెరగను. యెవరూ నన్నెరగరు. నేనో నిరంతరాన్వేషిని. నేనో ఏకాకిని"

"తమరు మా దుర్గంలో మాధవాచారిగారి అబ్బాయంది"

"భూమ్మీద పడటానికి యెవరో వొకరి కడుపున పడాలిగా !"

"ఐతే తమకి తల్లిదండ్రులు లేరా బాబూ ?"

"నేనే అందరికీ తల్లినీ తండ్రినీ నన్ను కనే శక్తి యీ సృష్టిలో యెవరికీ లేదు"

శ్రీపతి అలా మాట్లాడుతుంచే కరణం రామ్మూర్తి నరాల్లో ఏంత విద్యుత్తు ప్రవహించింది. కంగారుపడి పోయాడు.

"నా పేరు రామ్మూర్తి అంటారండి ... యీ వూరా
వికి చాలాయేళ్ళుగా కరణాన్నేగాక వూరి పెద్దల్లో ఒకణ్ని."

"ఇక నువ్వా వూరి పెద్దగా ఎన్నోఏళ్ళు బ్రతకలేవ్"

అదిరి చతికిలపడ్డాడు రామ్మూర్తి.

"ఎందుకు బ్రతకను స్వామి! రోగమొచ్చి చచ్చి
పోతానా?"

"రోగం నీక్కాదు. నీ వూరి మొత్తానికే వస్తుంది
బాబూ?"

"అంటే ఊరంతా చనిపోతారా స్వామి?"

"ఔను."

"ఎలాంటి రోగమో కాస్త ముందే శలవియ్యండి
స్వామి! మా పక్కవూరు మల్లసముద్రంలో పశువుల
డాక్టరుగార్ని ముందే పిలిపించి పెట్టుకుంటాం"

"వినయితే."

"చిత్తం!"

"మరో నెల దినాల్లో మీ ఊరి చివరి యేరు ఓ అర్థ
రాత్రివేళ పెద్దగా పొంగి తీరుతుంది. ఆ సమయానికి ఊరు
మాటుమణిగి వుంటుంది. ఉప్పెన వూరిని తుడిచిపెట్టుకు
పోయి మరు భూమిగా మారుస్తుంది."

ఆ మాటలకి రామ్మూర్తి గుండెలు పగిలినంత
పనయింది.

"ఉప్పెన యిక ఆగదా స్వామి!"

"ఈ సృష్టిలో పెరిగే కాలాన్ని తరిగే ఆయుషునీ
ఆపగలిగేదెవరు?"

"స్వామి! నా గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయ్. ముందు కాస్త వీభూతి యేదైనా యివ్వండి" అని రామ్మూర్తి అడగడంతోనే చెయ్యి గాలలోకి విసిరి గుప్పెడు వీభూది గుప్పెట్లో సృష్టించి యిచ్చాడు శ్రీపతి.

ఆ దృశ్యం చూడ్డంతో రామ్మూర్తికి శ్రీపతి మీద పరిపూర్ణమైన విశ్వాసం ఏర్పడిపోయింది.

ఆ వీభూది చిటికెడు మింగి ఆశ్రమవాసిని నళిని యిచ్చిన వీళ్ళు తాగి,

"మరైతే... మరైతే ఉప్పెన వచ్చాక మావూరు ఏమౌతుంది స్వామీ?"

"ఊషర క్షేత్రం."

"మరి మా జీవితాలెలా స్వామీ?"

"ఉప్పెన వూరినంతా చంపి వూరి పెద్దల్లో యెవరో వొకడ్ని మాత్రం బ్రతికించి పోతుంది. ఆ వొక్కడూ భవిష్యత్తులో కోటీశ్వరుడు ఐ తీరుతాడు."

"యెలా ఔతాడు స్వామీ?"

"ఉప్పెన మీ వూర్ని ముంచి పోయాక వూరు సర్వనాశనం ఔతుంది. అంతా చనిపోతారు. ఇళ్ళన్నీ కూలిపోతాయి. కేదారేశ్వరుడి గుడి కూడా కూలి నాశనం ఔతుంది. బ్రతికిన ఆ ఒక్కడికి గుడిలోంచి బయల్పడే బంగారు నిధి దొరుకుతుంది. అవి యెన్నాళ్ళుగానో భూమిలోకి పూడ్చి వున్న దేవుడి నగలపెట్టె.

ఆ మాటలు వింటున్న రామ్మూర్తికి స్పృహ తప్పాలిసిందే కానీ, తప్పలేదు. చెమట అతని దేహంపైన కాల్వలై పారుతుంది. శ్రీపతి మాటలు వేడివాక్కుల్లా సోకుతున్నాయ్ అతని కర్ణభేరులకి.

"తమ దివ్యశక్తులకి అంజలి ఘటిస్తున్నాను స్వామీ! గతంలో చేసిన తప్పులకి నన్ను క్షంతవ్యుణ్ని చెయ్యండి." అని శ్రీపతి పాదాలమీద పడ్డాడు రామ్మూర్తి.

కాస్సేపటికి నిష్క్రమించాడు.

• • •

రామ్మూర్తి చెప్పింది అంతా చాలా శ్రద్ధగా విన్నారు మిగతా వూరి పెద్దలు ముగ్గురూ.

ప్రతీ సమస్యనీ కాస్త నిశితంగా ఆలోచించి సమాధానం చెప్పే శక్తి ఆ నల్గురిలో కరణం రామ్మూర్తికొక్కడికే వుంది. అలాంటి రామ్మూర్తి ఆ శ్రీపతిని స్వామీ... స్వామీ... యీ యుగంలో అవతరించిన దేవుడు అంటుంటే యింకేం మాటాడగలరు. పైగా శ్రీపతి చెప్పే జాతకాలు యెంత వరకూ నిజం ఔతున్నాయి అనేది వూళ్ళో తెలుస్తూనే వుంది.

చాలా సేపు ఆలోచించి అంతా సంపూర్ణంగా నమ్మేశారు ముగ్గురూ.

ఐతే యీ వూరికి వరదొస్తే అంతా చనిపోగా వూరి పెద్దల్లో యెవరో వొకడే మిగిలి వుంటాడు అనడంలో వాళ్ళల్లో వాళ్ళకి శంకలూ భయాలు పుట్టాయ్.

యెవడై వుంటాడు ఆ వొక్కడూ ???

ఆ రాత్రి యెవరిళ్ళకి వాళ్ళు పోయాక ఏ ఒక్కడికీ నిద్రపట్టలేదు.

ఆ నిధిని కాజేద్దామని ఒక్కొక్కరి గుండెలోనూ పెద్ద కోరిక.

మరుసటి రోజు వొకడికి తెలీకుండా వొకడు శ్రీపతి దగ్గిర కెళ్ళాడు.

అందరికీ కరణం రామ్మూర్తికిచ్చిన సమాధానాలే యిచ్చాడు శ్రీపతి.

• • •

నెల తర్వాత పూరిచివరి ఏటిలో నీరు కాస్త ఎక్కువైందని విన్నవెంటనే ఊరి పెద్దలు నలుగురికీ దడ పుట్టింది.

ఒక్కడి మనసులోనూ యెంత గందరగోళం రేగుతున్నా రోజూలాగే, ఆ రోజు సాయంత్రంకూడా ప్రెసిడెంటు బుచ్చిరెడ్డి ఇంటి అరుగు మీద విశాణా వేశారు.

"ఆ శ్రీపతిగాడు వొట్టి ధంబాల వెధవ." అన్నాడు రామ్మూర్తి.

"ఔను... చెయ్యి గాలిలోకి విసిరి వీభూది సృష్టించాడంటే వాడిదగ్గర ఏదో మణికట్టు వుండుంటుంది" అన్నాడు బుచ్చిరెడ్డి.

"నాదో అనుమానం...నా కూతుర్ని చెరిచిన వెధవ స్వాములవారు ఎలా ఔతాడు'' అని కడుపులో దాచుకున్న దానికి వ్యతిరేకంగా గొంతుతో అలా కక్కాడు రాజేశ్వర్రావు మేస్టారు.

"ఇంత తెల్సున్న మనం యిలా నమ్మకూడదు" అని తేల్చాడు మున్సబు నరసింహం.

"మీరెవరూ నమ్మకండి" అనేశాడు బుచ్చిరెడ్డి.

"ఛ...ఛ మేం నమ్మం" అన్నాడు రామ్మూర్తి.

"ఐనా గుడికింద నిధి వుండటం యేమ్టిటీ యిదేమన్నా రాజుల కాలమా?" అనేసి చిరాకుపడ్డాడు. రాజేశ్వర్రావు మేస్టారు.

"మనకి బుద్ధులు అప్పుడప్పుడూ పెడదారి పడ్తుంటాయి. లేకుంటే మనం యీ చిన్న విషయమ్మై యిన్ని ఆలోచన్లు చెయ్యడమేమిటీ?" అన్నాడు నరసింహం.

"ఔను...కాస్త ఆలశ్యమైతే ఐందిగానీ భలేమాట చెప్పావ్'' అని నవ్వేశాడు ప్రెసిడెంటు బుచ్చిరెడ్డి.

ఆ చర్చ ముగిసేలోపు వాళ్ళలో ఒకడిలో ఒకడు అంతర్గతంగా వరద వస్తుందంటే వొకడు నమ్మడంలేదను కుని దృఢపర్చుకున్నారు.

"మరి విడిపోదాం యీ రోజుకి. యీ విషయమై యెవరూ పట్టించుకోకండి.'' అని లేచాడు బుచ్చిరెడ్డి.

"అబ్బెబ్బే మాకామాత్రం మతులు లేవా ! ముందు మీరు పట్టించుకోకండి'' రామ్మూర్తి కూడా లేచాడు.

అంతా యెవరిళ్ళకి వాళ్ళు బయలుదేరారు,

• • •

"పతీ!"

"వూ!"

"యింకా యెంతకాలం యీ భగన్నామస్మరణ."

"ఆఖరి అంకం పూర్తయ్యే వరకూ."

"యింకా యెంతకాలం?"

"యింకెంతో కాలం పట్టదు. రోజులు. రేపు లేదూ యెల్లుండి?"

"వీళ్ళు నువ్వనుకున్నంత అమాయకులంటే నాకు నమ్మకం లేదు."

"నువ్వే చూద్దువు నళినీ! అనుకున్నది జరిగి తీరు తుంది. అనంతరం వూరు ప్రశాంత సాగరం ఔతుంది. అప్పుడు ఆ వూరి అమాయకపు జనానికి మనం జ్ఞానబోధ కలగ జేద్దాం."

"అద్సరే ...... సఖీ నెందుకు పొమ్మన్నావ్?"

"సఖీ ...... ఆమె మరో వంద సంవత్సరాల

తర్వాత పుట్టాల్సింది. ఆమె మరీ విచ్చల విడి మనిషి... నేను కోరేది మనిషిలో ఈర్ష్య స్వార్థనశింపు. కలగంపుతనం కావాలనేది నాకోరిక. నేను స్వేచ్ఛావాదిని. అంతే ... అంతే.''

"అసలు సధీ యెవరు?

"సధీ... యీ మనుషులకి అతీతమైన వొక వింత కావ్యం. ఆమె ప్రవర్తనకి నాలాంటివాడే పిచ్చాడుగా తయారౌతాడు. జనం దృష్టిలో సధీ వొక పాడైన వ్యక్తి. విచ్చల విడి మనిషి.''

"ఆమెతో యెందుకు వెళ్ళనన్నావ్?"

"వెళ్ళకూడదు... అంతే వీలైతే అర్థం చేసుకో."

"నేను మాత్రం యెక్కడికీ వెళ్ళను పతీ!"

"అసలు యెలా వెళ్ళగలవ్?''

"యెందుకు వెళతానూ?"

"నీకు తెలీదు నళినీ! నువ్వు నాలో లీనం, ఐపోయావ్."

"ఓహ్ అదా!''

కిల కిలా నవ్వేసింది నళిని.

• • •

రెండు రోజులుగా వర్షం కురుస్తోంది ఎడతెరిపి లేకుండా

"దాలమ్మా!

"యేం బాబూ!"

"నా పెట్టెలూ అవీ యిలా పెట్టు"

''యెందుకు బాబూ?"

"ముందు పట్టుకొచ్చి పెట్టు." కోపంగా అరిచాడు బుచ్చిరెడ్డి.

బెదిరి పోయింది ముసిలి వంటమనిషి దాలమ్మ. వెంటనే లోనికి పరుగెత్తింది పెట్టెలు తేవడానికి.

దాలమ్మ బుచ్చిరెడ్డి బట్టల పెట్టెలూ డబ్బుదాచే గంధ చెక్కపెట్టె అన్నీ పట్టుకొచ్చి బుచ్చిరెడ్డి పడుకునే పట్టె మంచం మీద పెట్టింది.

బుచ్చిరెడ్డి ఆ పెట్టెలో ముఖ్యమయిన వస్తువుల్ని డబ్బునీ - దస్తావేజుల్ని వొక చిన్న పెట్టెలోకి సర్దేస్తుంటే

"బాబూ ! ... వూరు ప్రయాణమా ?" అడిగింది దాలమ్మ.

"ఆఁ ... వల్లకాట్లోకి''

"అది ... అదికాదు బాబూ బట్టలూ అవీ సర్దుతుంటే అర్జంటు ప్రయాణమేమో అని ..."

"ఆఁ ... అర్జంటే ... వూళ్ళోకి వరదొస్తోంది.." అని నాలిక కొరుక్కున్నాడు బుచ్చిరెడ్డి.

"ఏవిఁటి బాబూ ! వరదొస్తుందా వూళ్ళోకి ?"

"లేకపోతే ఏమిటి నీ పిచ్చి ప్రశ్నలు ?" సర్దుకుంటూ చిరాగ్గా అన్నాడు బుచ్చిరెడ్డి.

"బయట వర్షం చూడండి బాబూ ?... కాస్త భోం చేపెస్తే వంటిల్లు సర్దుతాను." అంది దాలమ్మ.

## 24

"భోజనమూ వద్దు పాడూ వద్దు ముందిక్కడినుంచి వెళ్ళు" చిరాగ్గా" అరిచాడు కరణం రామ్మూర్తి.

"సంధకాడనుంచి చూస్తున్నాను... బట్టలూ అవీ ఆ పెట్టెలో సర్దుతున్నారు యెందాక ప్రయాణం ?" రామ్మూర్తి గయ్యాళి భార్య నిలదీసి అడిగింది.

"ఏట్లోకి వస్తావా ?" కోపంగా అరిచాడు రామ్మూర్తి

రామ్మూర్తి భార్య అతనికేసి అనుమానస్పదంగా చూసింది. యిన్నాళ్లు నేనేమంటే బెదిరిన భర్తేనా యితను అనే అనుమాన మొచ్చింది అతని జవాబుకి.

"ఏమిటండీ ఆ మాట లేమిటి నా కర్థంగాదు ?" మరీ నిలదీసిందామె.

"లేకుంటే నీ ప్రశ్న లేమిటోయ్ ?"

"యెక్కడికి అని అడగడం తప్పా ?"

"తప్పా తప్పున్నరా నేను గంగలోకి వెళ్ళుతాను. కాష్ఠంలో కాలుతాను నీ కెందుకూ ?"

రామ్మూర్తి మాటలకి ఖిన్నురాలయింది అతని గయ్యాళి భార్య.

"ఈ వర్షంలో మీరు కాలదామన్నా కాష్టం కాలదు." మరీ చిరాగ్గా అందామె.

"నాకు చిరాకెత్తించకు ముందిక్కడి నుంచెళ్ళు" గట్టిగా అరిచాడు.

సణుక్కుంటూ ఆ గదిలోంచి వంటింట్లోకి వెళ్ళింది రామ్మూర్తి గయ్యాళి భార్య.

వర్షం దబదబా కురుస్తుంది, జల్లు ఇంట్లోకి కొడ్తుంది.

వర్షాన్ని గయ్యాళి భార్యని తిట్టుకున్నాడు రామ్మూర్తి—

"వెధవ సంత రేపటినుంచి పీడ విరగడౌతుంది"

• • •

"యింతకాలం నుంచీ లేంది యివ్వాళ మీకు పీడయ్యానా?" అభిమానంగల రాజేశ్వర్రావు మేష్టారి భార్య రాజ్యలక్ష్మి అలా అడిగింది.

"నిన్నెప్పుడన్నా పీడ అన్నానా రాజ్యం శని అన్నాను గానీ వెళ్ళు." శాంతంగా అన్నాడు రాజేశ్వరావు మేష్టారు.

"అది కాదండీ......వర్షం చూస్తే యిలాగుంది. కుర్రాడికేమో జ్వరం. వొళ్ళు పేలి పోతోంది. ముందా సర్దడం ఆపి కాస్త డాక్టర్ని పిల్చుకొద్దురూ!"

"యీ వర్షంలో యేం వెళ్తాం... పొద్దుట చూద్దాంలే"

"యీ వాతావరణానికి మరీ పెరిగేలా వుంది జ్వరం.

"పెరగని"

"ఏమిటండీ మీరనేది???"

"ఔనోయ్... పెరగనీ పెరిగితే చస్తాడు అంతేగా"

"యింత ప్రేమగల కొడుకుని యిలా అన్డానికి మీకు నోరెలా వస్తుందండీ!"

"యెక్కువ వాగకు వెళ్ళు."

"కాస్త టీ కాచిస్తాను. తాగి, గొడుగు వేసుకుని

ఆ డాక్టరు రామేశం గార్ని పిల్చుకు రద్దురూ!"

"అందుకే పీడ అన్నాను. వెళ్ళు." అరిచాడు.

జ్వరంతో వున్న వాళ్ళబ్బాయి మంచం దగ్గరకి వెళ్ళి వాడి వొళ్ళుచూసింది రాజ్యలక్ష్మి. నిజంగా వాడి వొళ్ళు జ్వరంతో పేలి పోతుంది పెనంలాగ. వేగంగా తిరిగిపెట్టె సర్దుతున్న భర్త దగ్గర కొచ్చింది రాజ్యలక్ష్మి.

"ఏవండి... జ్వరం బాగా పెరిగిపోయింది. వాడి వొళ్ళు పెనంలా కాలిపోతుంది... ముందు వెళ్ళండి."

"ముందు ఇక్కడనుంచి వెళ్తావాలేదా" అనేసి భార్య చెంప ఛెడేల్ మని పించాడు రాజేశ్వర్రావు మేస్టారు.

ఆమె ఘాతానికి భర్తకేసి వింతగా చూసింది. యిన్నేళ్ళూ యింత అభిమానంగా అన్యోన్యంగా తనతో జీవించిన భర్తేనా యితను ???

"నన్ను కొట్టినా చంపినా సరే ముందు మీరు డాక్టర్ దగ్గరకి వెళ్ళాల్సిందే" అని రాజేశ్వర్రావు మీద రాకాసిలా పడింది అతని భార్య రాజ్యలక్ష్మి.

"నువ్వు అరు చావు యీ వర్షంలో నేను వెళ్ళనంటే వెళ్ళను."

• • •

"వెళ్ళరు కదూ నన్ను విడిచి" అని తన వెచ్చటి గుండెలకి గట్టిగా అదుముకుంది నీలవేణి.

'వెళ్ళనన్నాగా!" ఆమె కౌగిలిలో ఇరుకుగా కదిలాడు మున్సబు నర్సింహులు. మున్సబు నరసింహులకి యిది

మూడో పెళ్ళి. నీలవేణి మంచి వయసులో వుంది. యేరాత్రి భర్తని విడిచి ఆమె వొంటరిగా పడుకోలేదు. ఏ అర్ధరాత్రి పక్కలోంచి భర్త లేచి వెళ్ళితే చాలు స్పర్శలేక యి ఆమెకి నిద్ర పట్టదు. అలాంటి కోరికలు గల వయసులో వున్న నీలవేణి యీ వర్షం రాత్రి భర్తతో వెచ్చగా పడుకుందామని యెక్కడికీ తనని వదిలిపెట్టి వెళ్ళద్దని కౌగిలిలో బిగించింది. అందుకే ఎప్పుడూ లేని ఆమె కౌగిలి ఆ దినం యిరుగ్గా వుంది ఏభై ఏళ్ళ నరసింహంకి.

అప్పటికే సమయం రాత్రి ఎనిమిది కావొస్తుంది.

చెప్పితే వినదు దీన్ని కాస్త నిద్రపుచ్చాలి అనుకున్నాడు నరసింహం.

నీలవేణి తన కాళ్ళని భర్త కాళ్ళ చుట్టూ అల్లింది. చేతులు మెడ చుట్టూ చుట్టింది, ముఖం అతని ముఖంలోకి దూర్చింది. నిజంగా ఆ వర్షం కురుస్తున్న ఆ రాత్రి ఆమెకి ఆ పరిష్వంగం వెచ్చగా హాయిగా వుంది.

సరిగ్గా తొమ్మిదిగంటలకి అలసిపోయిన నీలవేణి గాఢనిద్రలోకి వెళ్ళింది.

మంచం మీంచి ఆదరా బాదరా లేచిన నరసింహం వేగంగా పెట్టె సర్దడంలో నిమగ్నమయ్యాడు.

వర్షం.

వూరు మాటు మణిగింది.

సరిగ్గా పదిగంటలైంది.

ఆ వూరిపెద్దలు దేవుడికి పరమ భక్తులు ఐన ఆ నల్గురూ తమ స్వార్థంకోసం భార్యా పిల్లల్ని యీ ప్రపంచాన్నీ తమ స్వార్థం-అత్యాస కోసం తమ ప్రాణాల కోసం విస్మరించి వొక్కొరూ వొకో గునపం తీసుకుని కేదారేశ్వరుడి దేవాలయానికి వచ్చారు వొకళ్ళని వొకరు చూసుకున్నారు.

నల్గురికీ ఆ చలిలో వర్షంలో చెమటలు పోశాయ్.

చాలాసేపు అలా వొకళ్ళు నొకళ్ళు చూస్తు వర్షంలో తడుస్తూ వుండిపోయారు.

వొక్కొక్కడి చేతిలోనూ వొకో గునపం వుంది.

వాళ్ళు ఆలోచన గర్భగుడిని తెల్లవారే లోపు తవ్వేసి అడుగున వున్న నిధి అయినా దేవుడి నగలు పెట్టెని తీసుకుని తెల్లవారేలోపు వరద వొచ్చి ఊరిని ముంచేలోపు యీ ఊరి నుంచి పరారవుదామని.

కష్టంమీద వొకణ్ణొకడు పలకరించుకున్నారు.

పది నిమషాలు చర్చించారు,

చర్చ ముగిసింది.

ఆ నిధిని నలుగురూ పంచుకోవాలని నిర్ణయమైంది.

తెల్లవారే లోపు అంతా అయిపోవాలి.

ఊరి కళ్ళుగప్పి పరారయి పోవాలి.

నలుగురూ గునపాలు తీసి గర్భగుడి తలుపులు పగలగొట్టి లోనికి ప్రవేశించారు.

తలుపులు మూసేసి నలుగురూ గర్భగుడి నాలుగు చెరగుల తవ్వడం మొదలు పెట్టారు.

వాళ్ళు తవ్వే చప్పుళ్లు దబదబా కురుస్తున్నా ఆ వర్షం చప్పుళ్ళలో కలిసిపోతున్నాయి.

గుడి లోపలి రాతినేల గునపాల దెబ్బలకి పగిలి విచ్ఛేదం అవుతుంది.

నలుగురి గునపాలు పోట్లూ వేగంగా పడుతున్నాయి.

నలుగురి దేహాల మీదా స్వేదం వరదలా పొంగుతుంది.

ఇంతలో ఊహించని సంఘటన.

ఏమిటి — ఏమైంది ??

గర్భగుడి తలుపులు మూసి లోపల తవ్వుతున్న ఆ నలుగురికీ యేవో అరుపులు విన్పించాయి.

"బయటేదో అలజడి." అన్నాడు రామ్మూర్తి.

"అపశకునాలు పలక్కు."

"అలజడికాదూ వల్లకాడూకాదు. వర్షంపెరిగుంటుంది"

"తవ్వండి"

యెవరో గర్భగుడి తలుపులు తెరిచారు.

బయట కన్పించిన ఆ దృశ్యాన్ని నలుగురి కళ్ళు నమ్మలేక పోయాయ్.

నలుగురికీ చాలా వింతగా వుంది.

కలలా వుంది.

వాస్తవంలా అసలూ లేదు.

గర్భగుడికి ఎదురుగావుండే మండపంమీద మౌనంగా కూర్చున్నాడు శ్రీపతి.

చుట్టూ కాగాడాలతో జనం. వాళ్ళ చేతుల్లో బళ్ళాలు కర్రలు.

వాళ్ళిక శార్దూల్లాగా ముందుకు వురికేస్తారు.

నగ్గురి చేతులూ వణికి పోతున్నాయ్.

నగ్గురికీ యిక్కడ వో అగాధం వుంటే బాగుణ్ను అన్పిస్తుంది.

జనం మీదపడ్డారు.

క్షణంగడిస్తే ఆ నగ్గురి తలలూ పేదరాసి పెద్దమ్మ

కథలోలాగా వెయ్యిపెచ్చు లవ్వాల్సిందే. ఇంతలో మౌన వ్రతంలోవున్న శ్రీపతి లేచి ఆ సంగ్రామానికి సేతువులా అడ్డుపడ్డాడు.

ధర్మప్రభువులూ-దేవుడి పరమభక్తులూ అని ఋన్నే ళ్ళుగా నమ్మిన వూరిజనం కళ్ళల్లో వజ్రాయుధాలూ - బధ బాణాలూ కన్పిస్తున్నాయ్.

నలుగురు పెద్దవాళ్ళతో కట్టుబాటుంచే శ్రీపతి ఆజ్ఞ కట్టవిచ్చింది గాదు.

నలుగురూ శ్రీపతి చరణాలపై బడ్డారు.

# 25

ఆ మరుసటి రోజునుంచీ ఆ వూళ్ళో చల్లటి గాలి ప్రవేశించింది.

ఆ వూరు చాలా విశాలంగా కన్పించింది. కల్మ షాన్ని క్షాళనం చేసిన శ్రీపతికీ-నళినీకి.

యీ జనానికి యింకా యెన్నో పిర్వచించాలి. అని వూహాగానం చేశాడు శ్రీపతి.

కొన్నాళ్ళకి పై ప్రదేశాల్నుంచి తిరిగి వొచ్చిన గంగాధరం శివా, లక్ష్మి వాళ్ళతో కలిశారు.

ఒకప్పుడు

తాగుబోతూ -

దొంగ -

రౌడీ -

అని జనంతో పిలవబడ్డ శ్రీపతి -

ఇప్పుడు

నిజమైన ధర్మప్రభువు - మనీషి అయ్యాడు.

ఆ ప్రదేశంలోచస్తే ఈర్ష్య-కుళ్ళు-కల్మషం అంటవు.

కుట్రలు జరగవ్ -

జరక్కూడదు.

అది

శ్రీపతి ప్రపంచం.

—: సమాప్తం :—



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA133M123 |
| పుస్తకం పేరు | నవలా స్నేహ |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 125 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | 2,1,Bci |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Sumitha |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Ruksana |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good. |